శ్రీరస్తు.

# శ్రీగయామాహాత్మ్యము

వచనకావ్యము.



శ్రీకాశీనివాసి రాచకొండ. అన్నయ్యశాస్త్రిగారిచే

రచింపఁబడినది.



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచేఁ
ప్రకటితము.
1924

# గయాక్షేత్రమందలి సర్వతీర్థనామములు.

## శ్రాద్ధాదులసలుపు స్థానములు.

---

| తీర్థములు. | సంఖ్య. |
|---|---|
| 14 పునఃపునానది. పాదపూజ, శ్రాద్ధము. | 1 |
| 15 ఫల్గుతీర్థము-ఇందు స్నానము, చరుపిండశ్రాద్ధము. | 2 |
| 1 బ్రహ్మకుండము-యవపిండశ్రాద్ధము. | 3 |
| ప్రేతశిలా శ్రాద్ధము. | 4 |
| రామశిలా శ్రాద్ధము. | 5 |
| రామకుండశ్రాద్ధము. | 6 |
| కాకబలి-మూడు పిండములు, కాక, శ్వాన, యములకు. | 7 |
| 2 పంచతీర్థములు. | |
| ఉత్తరమానస శ్రాద్ధము. | 8 |
| ఉదీచీశ్రాద్ధము. | 9 |
| కనఖలశ్రాద్ధము. | 10 |
| దక్షిణమానసశ్రాద్ధము. | 11 |
| జిహ్వాలోలశ్రాద్ధము. | 12 |
| గదాధరునకు పంచామృతస్నానము. | 13 |

| తీర్థములు. | సంఖ్య. |
|---|---|
| 3 సరస్వతీస్నానము - పంచరత్న దానము. | 14 |
| మతంగవాపీశ్రాద్ధము. | 15 |
| ధర్మారణ్యయూపకూపమధ్యమమందు శ్రాద్ధము. | 16 |
| బోధితరుశ్రాద్ధము. | 17 |
| బ్రహ్మసరోవరశ్రాద్ధము. | 18 |
| కాకబలీశ్రాద్ధము. | 19 |
| తారకబ్రహ్మదర్శనము-ఆమ్రసించనము. | 20 |
| 4 రుద్రపదశ్రాద్ధము. | 21 |
| విష్ణుపదశ్రాద్ధము. | 22 |
| బ్రహ్మపదశ్రాద్ధము. | 23 |
| 5 కార్తికేయపదశ్రాద్ధము. | 24 |
| దక్షిణాగ్నిపదశ్రాద్ధము. | 25 |
| గార్హపత్యాగ్నిపదశ్రాద్ధము. | 26 |
| ఆహవనీయాగ్నిపదశ్రాద్ధము. | 27 |
| సూర్యపదశ్రాద్ధము. | 28 |

# ఉపోద్ఘాతము.

సంచింతయే ద్భగవత శ్చరణారవిందం
వజ్రాంకుశధ్వజసరోరుహలాంఛనాఢ్యమ్,
ఉత్తుంగరక్తవిలసన్నఖచక్రవాల
జ్యోత్స్నాభిరాహతమహద్ధృదయాంధకారమ్.

గయామాహాత్మ్యము వాయుపురాణాంతర్గతము. దీని మాహాత్మ్య విశేషములను సనత్కుమారుని వంటి మహనీయుఁడు తాను వర్ణింపఁజాలనని చెప్పియున్నాఁడు. మఱియు నీస్థలమును బలువురు మహర్షులు పలువిధములఁ బొగడియున్నారు. ఆవిధమంతయు వ్రాయఁ బూనిన గొప్ప గ్రంథమగును గాన దానిని మాని కేవలము గ్రంథభాగమునే యిందుఁ బొందుపఱచితిని. గయాక్షేత్రము పితరులకు శ్రాద్ధాదికృత్యములవలన ముక్తి నొసంగునది యని వేదమంత్రములు ఘోషించుచున్నవి కదా! ఈ గ్రంథమునుఁబఠించి యిందుఁ జెప్పఁబడిన విధమున శ్రాద్ధాదులు సలిపి ఋణత్రయ విముక్తులగుటకుఁ బ్రతిమానవులునుఁ బ్రయత్నము సేయవలయును.

తొలుదొలుత గయామాహాత్మ్యమునుఁబద్యమయముగ వ్రాయఁదలంచి కొంతభాగము వ్రాసితిని. నామిత్రులు కొందఱు వచనముగ వ్రాసిన సర్వజన సుబోధక మగునని తెల్పినందునఁ బద్యమయముగ మఱి యొక సమయమునఁ బూర్తి చేయఁ దలంచి యిపుడు వచనముగ వ్రాసితి. దీని నిట్లు వ్రాయ నా కత్యంతప్రోత్సాహ మొసర్చిన గయావళివిశ్వేశ్వర

లాలు, శ్యామలాలుగారి గుమాస్తాయును నామిత్రులునగు శ్రీ బాలగోవిందు గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈ పొత్తమును దోషరహితముగ నొనర్చి ముద్రణ విషయక శ్రమను వహించిన నా ప్రియ మిత్రులగు బ్ర॥ శ్రీ॥ జనమంచి శేషాద్రిశర్మ గారికి నా కృతజ్ఞత నిందు మూలముగఁ దెలుపుకొనుచున్నాను.

ఇట్లు సజ్జనవిధేయుఁడు,

రాచకొండ - అన్నయ్యశాస్త్రి.

## నిత్యయాత్రాదర్శనము.

---

శ్లో. గదాధరం విష్ణుపద మష్టాదశపదాన్ రవిం,
వందేఽక్షయవటం ఫల్గుం లక్ష్మీంగౌరీం గయేశ్వరీం.

1 ఆదిగదాధరుఁడు.
2 విష్ణుపదము.
3 పదునెనిమిదివేదులు.
4 సూర్యభగవానుఁడు.
5 అక్షయవటము.
6 ఫల్గునదీతీర్థము.
7 లక్ష్మి.
8 మంగళగౌరి.
9 గయేశ్వరి.

గయాక్షేత్రయాత్రాపరు లెంతకాలము గయాక్షేత్రమందు వాసముసేయుదురో, అంతకాలము, ప్రతి నిత్యము, ఈదేవతలను దర్శనముసేయవలయును.

శ్రీ గణేశ్వరాయనమః.

శ్రీ ఉమామహేశ్వరాయనమః.

# గయామాహాత్మ్యము.

## ప్రథమాధ్యాయము.

---

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమహర్షులతోఁగూడి దేవర్షియగు నారదుఁడు, నిఖిలపురాణవైఖరీ విస్తారు సనత్కుమారుఁ గని, విధిపూర్వకముగా నమస్కరించి, దేవా! సనత్కుమారా! త్రిజగంబులయందునుమీఱ లెఱుంగనివిషయము వేఱొండుఁగానము. సమస్తతీర్థములలో నుత్తమోత్తమమై, తీర్థరాజంబై, యెద్దాని మాహాత్మ్యమును వినినను బఠించినను నుభయతారకమై, సమస్తపాపక్షయకరమై, మోక్షదాయకమై విరాజిల్లున దెద్దియో సెలవొసంగి, మాయజ్ఞానతిమిరంబును దమ వచనప్రభాకరకాంతిచే వెడలఁద్రోచి మమ్ముఁ గృతార్థులఁజేయఁ బ్రార్థించుచున్నాననినఁ బరమదయాకరుండగు సనత్కుమారుం డిట్లు చెప్పందొడంగె:—

యోగవిద్యావిశారదా, ఓ నారదా ! ఈ నీప్రశ్నించిన యర్థంబు పరోపకారార్థంబై, సమస్తప్రాణులకు మోక్షదాయకంబై యొప్పుచున్నయది. చెప్పెద. సావధానుండవై శ్రద్ధాభక్తులతో నాలకింపుము.

పరమపవిత్రమై, శ్రాద్ధాదికర్మములచే సమస్తప్రాణులకు మోక్షమొసంగునట్టిదియై, సమస్తతీర్థములలో నుత్తమోత్తమంబై విరాజిల్లు గయాతీర్థంబను నొక్కతీర్థంబుగలదు. దాని

మాహాత్మ్య మమితము. బ్రహ్మాదులైనను వివరించి చెప్పఁజాలరన నే నెంతవాఁడ. అయినను నానేర్చిన తెఱం గెఱింగించెద. తొల్లి గయాసురుండను దైత్యవల్లభుఁడు శ్రీమహావిష్ణువరప్రభావమున, విచ్చలవిడి సంచరించుచు, బ్రహ్మాది దేవతలను విపన్నహృదయులఁ జేయుచుండ, సహింపనోపక, భక్తవత్సలుని, నాశ్రితపక్షపాతిని, శ్రీమన్నారాయణునిఁ జేరి మొఱలిడ, తదనుజ్ఞచే బ్రహ్మ గయాసురునిం జేరి శ్రీరమావరువరప్రభావమున నదీనదనగరారణ్యముల కన్నమిన్నయై పవిత్రతరమై, యఘనాశకమై వెలుగొందు నీశరీరముకన్న వేఱొండు పవిత్రస్థలంబు ముల్లోకంబులం గానరాదు. కాన నే నొనర్పం బూనిన సవరాజంబును బూర్తిఁ జేయ నీశరీరమును నాకొసంగుమని ప్రార్థింప, నాదైత్యశేఖరుఁడు తద్వచనానుసారంబునఁ దనశరీరమును యజ్ఞార్థమై బ్రహ్మకొసంగెను. అపుడు ధర్మరాజు గయాసురుని శిరంబున నొకశిలను స్థాపించెను. దానినే ధర్మశిలయందురు. ఆశిలపై బ్రహ్మజన్నమొనర్చెను. నారదా! బ్రహ్మ తానొనర్చుసవనమధ్యమున దైత్యశరీర మటునిటు కదలకుండ స్థిరముగానుండునట్లు చేయుమని శ్రీమహావిష్ణునిఁ బ్రార్థింప, దేవదేవుం డాదిగదాధరనామంబున ధర్మశిలపై నిలిచి దైత్యశరీరమునకు నిశ్చలత్వ మొసంగెను. అపుడు బ్రహ్మ జన్నమునుఁ బూర్తియొనర్చి, బ్రాహ్మణులకు గృహాదికముల దానమొసంగెను. శ్వేతవరాహకల్పమందు నాక్షేత్రమునకు గయ యనునామ మొసంగఁబడియె. ఈ క్షేత్రవాసమును బ్రహ్మాది దేవతలుకూడఁ గోరుదురు. నరకమునుగూర్చి భయమునొందు పితరులు గయాక్షేత్రమున కేగి మనలకందఱికిఁ బిండదానమొసంగి యీఘోరనరకకూపములనుండి వెలువఱచి సద్గతినొసంగెడు సుపుత్త్రుఁడు

త్సువంశమం దుద్భవమగునట్లుఁ గోరుచుందురు. గయాక్షేత్ర మునకేగు మనుజునిఁ జూచి తత్పితరులు, ఈపుత్త్రుఁడు తనపాపోపకమునైనను మనపేరున నీక్షేత్రమందు విడిచిన, సద్గతి నొందుదుమని యత్యధికోత్సాహానిమగ్నులగుదురు. ఈహేతువువలనఁ బితరులు తమతమ వంశములందు బహుపుత్త్రులు జనియించుటకుఁ గోరుదురు. ఎందులకన, వారిలో నొకఁడైనను గయాక్షేత్రమునకేగి, యచ్చట నశ్వమేధముఁగాని నీలవృషోత్సర్గముఁగాని, అన్నదానముఁగాని సలిపి, తమ్ముఁ దరింపఁజేసి ముక్తినొసంగుదురని వారియాశయము. అట్టి పుత్త్రులుగల పితరులనే పుత్త్రసంతులని చెప్పుదురు. గయాక్షేత్రమందు మూఁడుపక్షములు నివసించినమనుజుఁడు ఏడుకులముల పితరులను దరింపఁజేయును. అంతకాలము నివసించుట కశక్తుఁడైనమనుజుఁడు పదునైదు దివసములుగాని, యేడుదివసములుగాని లేక మూఁడురాత్త్రులుగాని నివసించి శ్రాద్ధాదికర్మము లొనర్చినయెడలఁ గల్పాంతమందు సల్పిన పాపసంచయమైనను వీడి తనపితరులతోఁగూడ ముక్తిఁజెందును ఏమనుజుఁడు గయాక్షేత్రమునందు తనపితరులకుఁ బిండదానమొసంగి తిలవిహీనముగా నాత్మపిండమిడునో, యట్టిమనుజుఁడు, బ్రహ్మహత్య, సురాపానము, గురుస్త్రీగమనము, స్వర్ణస్తేయము మొదలగు మహాపాపము లొనర్చినవాఁడైనను, పవిత్రుఁడై దోషరహితుఁడై తనపితరులకుసద్గతినొసంగి తానుగూడ ముక్తిఁజెందును. తమపుత్త్రులుగాని, వేఱొకరి పుత్త్రులుగాని, యెవరిగోత్రనామముల నుచ్చరించి ఈక్షేత్రమందుఁ బిండదాన మొసంగుదురో, అట్టిగోత్రనామములుగల పితరులు ముక్తిఁజెందుదురు. బ్రహ్మజ్ఞానము, గయాశ్రాద్ధము, గోశాలయందు మృతి, కురుక్షేత్రనివాసము ఈ చతురోపాయ

ముల, మనుజుఁడు, ఎద్దానిననుసరించినను ముక్తిఁజెందునుగాని, గయాశ్రాద్ధమువలన లభించు ఫలమునకు, బ్రహ్మజ్ఞానము, గోశాలయందు మృతి కురుక్షేత్రనివాసములవలనఁ గలుగు ఫలమునాటికిఁ గాఁజాలదు. గయాక్షేత్రమందు సర్వకాలములయందుఁ బితరులనుఁగూర్చి పిండదాన మొనర్చుట శ్రేష్ఠము. అధిమాసము, జన్మదినము, గురుశుక్రాస్తమయములందు, సింహరాశియందు బృహస్పతిసంచరించునపుడు, గయాశ్రాద్ధమొనర్చుట శ్రేష్ఠతరము. ఒకసారి గయాక్షేత్రమునకేగి పిండదాన మొనర్చుటయే కడుదుర్లభము, తత్ఫలమమితము. మోక్షదాయకము. అట్టియెడ గయాక్షేత్రమందు నివసించి, పితృయజ్ఞమును సలిపిన, ముక్తిలభించుటకు సందియము లేదని వాక్రుచ్చుట యనవసరము. అద్దానిఫల మిట్టిదియని చెప్పుటకు శక్యముగాదు. బ్రహ్మాదిదేవతలు, వశిష్ఠాదిమహర్షులు, ధర్మరాజాదిపితృదేవతలు, గయాక్షేత్రవాసమును గోరుదురు. బ్రహ్మజ్ఞానమువలన నెట్టిఫలము ప్రాప్తమగునో, అట్టిఫలము గయాక్షేత్రమందు అజ్ఞానముచే మృతినొందినను బ్రాప్తమగును. మగధాది నిషిద్ధదేశములందు మృతినొందిన మనుజులకు మోక్షార్థమై తత్పుత్రులు సర్వవిధముల గయాక్షేత్రమునకేగి శ్రాద్ధమొనర్చి పిండదానమొసంగవలయు. గయాక్షేత్రమందు నివసించు బ్రాహ్మణులకు (గయావళీలను నామమున సుప్రసిద్ధులు) దేవపితృసంప్రీతికై, అన్నదానాదిమహాదానము లొసంగి సంతుష్టిపఱచిన, దేవతలు, పితరులు తృప్తిఁజెందుదురు. ఉజ్జయినీ, కురు, విరజా, గయాక్షేత్రములయందు ముండనోపవాసములు సలుపరాదు. తదితరతీర్థములందు ముండనోపవాసము లవశ్యాచరణీయములు. దండి గయాక్షేత్రమునకేగి తనదండముతో విష్ణుపాదమును స్పృశిం

చిన, తనపితరులతో ముక్తిఁజెందును. దండిసన్యాసులకుఁ బు
ణ్యముగాని, పాపముగాని లేనికతంబున సర్వసంధ్యాది కర్మ
ములు త్యజించి, బ్రహ్మానుసంధానతత్పరులై, వేదాధ్యయనమొ
నర్చుచు, పూర్వపశ్చిమదక్షిణోత్తరముల చతురశ్రమమై, పంచ
క్రోశాత్మకమై, ముండపృష్ఠ మనంబరఁగు నీగయాక్షేత్రము
నకుఁ బ్రదక్షిణ మొనర్పవలయునని బ్రహ్మనుడివెను. ఈపంచ
క్రోశాత్మకమైన గయాక్షేత్రమధ్యభాగమున క్రోశపరిమితిగలదై
ముల్లోకములయందలి సమస్తతీర్థములకు స్థానమై, బ్రహ్మవిష్ణు
మహేశ్వరాది నిఖిలదేవతలకు నిలయమై, గయాసురునిశిరము
విరాజిల్లుచున్నయది. ఎవరు గయాక్షేత్రమునకేగి శ్రాద్ధాదిక
ర్మములు సలుపుదురో, వారు పితృఋణమునుండి విముక్తుల
గుదురు. ఏమనుజుఁడు గయాసురునిశిరముపై పిండాత్మక శ్రా
ద్ధమొనర్చునో, ఆమనుజుఁడు నూఱుకులములవఱకు తనపిత
రులఁ దరింపఁ జేసి ముక్తినొసంగినవాఁడగును మనోవాక్కా
యకర్మముల గయాక్షేత్రమున కరుగుదునని యేమనుజుఁడు
తన గృహమునుండి బయలువెడలి యెన్నిపదముల నిడునో,
ఆమనుజుని పితరులు అన్ని స్వర్గసోపానముల నెక్కుదురు.
ఏ మనుజుఁడు గయాక్షేత్రమున కరుగునో, ఆ మనుజుని కడు
గడుగున కశ్వమేధఫలము లభించును. ఇది నిశ్చయము. క్షీరా
న్నము, చరువు, యవలపిండి, బియ్యము, ఫలములు, దుంపలు,
నువ్వులు, బెల్లము, ఘృతము వీనిలో నెద్దానిచేనైనను పిండ
దాన మొనర్పనగు. కేవలము అన్నముచేసి, మధు, శర్కర,
ఘృత, దధి, పిణ్యాకఖండము (గారపిండి) లనుజేర్చి పితృప్రీ
తిగా పిండదానమొసంగిన నక్షయపుణ్యలోకప్రాప్తి యగును.
మానవులకుహవిష్యాన్నము, మునులకు క్షీరాన్నము నుత్తమ

మని చెప్పఁబడియున్నది. ముష్టి లేక యుసిరికకాయ లేక శమీపత్త్రప్రమాణముగలపిండములను గయాసురునిశిరముపై దానముచేయవలయును ఇట్టి పుణ్యతమమైన గయాక్షేత్రంబున భక్తిశ్రద్ధలతో శ్రాద్ధము సేయుపురుషుఁడు తననూటయొనిమిదిగోత్రముల పితరులనుఁ దరింపఁజేయును తండ్రి, తల్లి, భార్యఁ తోఁబుట్టువు, అల్లుఁడు, మేనమామ, మేనత్త యీయేడుకులములును, వీనిననుసరించిన నూటయొక్కశాఖలును (తండ్రివంశమున నిరువదినాలుగు గోత్రములు, తల్లివంశమున నిరువదినాలుగు గోత్రములు, భార్యవంశమునఁబదునాఱుగోత్రములు, తోఁబుట్టువువంశమునఁ బండ్రెండుగోత్రములు, అల్లునివంశమునఁ బదునొకండుగోత్రములు, మేనమామవంశమునఁ బదిగోత్రములు, మేనత్తవంశమున నెనిమిదిగోత్రములు) మనుజుఁడానర్చు గయాశ్రాద్ధమునవలనఁ దరించి ముక్తి నొందును. పిండప్రదానమొనర్చుసమయమున నాదిగదాధరుఁడైన శ్రీమహావిష్ణువును ధ్యానము సేయుచు, క్షీరాన్నము, చరువు, యవలపిండి మొదలగు పిండార్హపదార్థములనుఁ బుణ్యతమమగుఫల్గుతీర్థమునఁజేర్చి పిండదానమును సలుపవలయును. తీర్థశ్రాద్ధమందు, ఆవాహనము, దిగ్బంధనము (ఉదీచ్యైనమః) మొదలగునవి లేవు. మఱియు చండాలాది నీచజాతిమనుజుల దృష్టిదోషముఁగూడ లేదు. మనుజులు దయార్ద్రహృదయులై శ్రద్ధాభక్తులతోఁ దీర్థశ్రాద్ధము సలుపవలయు పిండాసనము, అవనేజనము, ప్రత్యవనేజనము, దక్షిణాసంకల్పము, అన్నసంకల్పము లొనర్పవలసినది విధియై యున్నది. కాలశ్రాద్ధమందు బితరులావాహామున వచ్చెదరు. తీర్థశ్రాద్ధమందు మనుజుఁడు తీర్థమున కరుదెంచుటఁజూచి తత్పితరులు వానిననుసరించి చనుదెంచెదరుగాన

నావాహన మనవసరము. తీర్థశ్రాద్ధమొనర్చు మనుజుఁడు కామ క్రోధాద్యరిషడ్వర్గమును వీడి, భూతదయాళువై, బ్రహ్మచర్యాశ్రమధర్మమవలంబించి, ఏకభుక్తము, భూతలశయ్య సత్యవ్రతమునుఁబూని భక్తిశ్రద్ధలు గలిగియుండవలెను. తీర్థయాత్ర సేయుమనుజుఁడు కామ్యమునువీడి శ్రీమన్నారాయణునిపాదకమలమును హృదయపీఠమందునిల్పి, యోగమార్గావలంబులు భగవంతుని నెట్టి నిశ్చలమానసమున ధ్యాన మొనర్చుచుందురో, అవ్విధంబున ధ్యానము సలుపవలయును. గృహస్థులు, సమస్త గృహకృత్యములందలి ధ్యానమును వీడి కేవల తీర్థయాత్రాతత్పరులై, భగవంతుని ధ్యానించుచుండవలయును. గయాక్షేత్రమందు దీర్థవిహీనమగుస్థలము తిలప్రమాణమైనను లేనికతంబున, సమస్తతీర్థములలో నధిక శ్రేష్ఠమై, బ్రహ్మావిష్ణుమహేశ్వరాది సమస్తదేవగణ నివాసభూమియై విరాజిల్లుచున్నయది. మీనమేషకన్యాధనుఃకుంభ రాసులయందు సూర్యుఁడు సంచరించునపుడును, మకరసంక్రాంతి, సూర్యచంద్రోపరాగములయందును గయాక్షేత్రమందు పిండదానమొనర్చుట యతిశ్రేష్ఠము. అమితఫలదాయకము.

ఇది వాయుపురాణమందు శ్వేతవరాహకల్పమునందు గయామాహాత్మ్యమునఁ బ్రథమాధ్యాయము.

---

# ద్వితీయాధ్యాయము.

---

నారదుఁడు శౌనకాదిమహర్షులతో, సనత్కుమారుని వాక్సుధారసముం గ్రోలి తనివివోవక, దేవా! ఋషిసత్తమా! గయాసురుని జన్మవిధానమెట్టిది? వానిప్రభావమెట్టిది? ఎందుకొఱకెవ్విధంబున నెవనిం గూర్చి తపమాచరించెను? వానిశరీరమెవ్విధంబునఁ బవిత్ర మయ్యె? ఈయావద్వృత్తాంతమును మాయందు కరుణాయత్తచిత్తులై సెలవొసంగి మముం బ్రీతులుగాఁ జేయ వేఁడుచున్నామన, సాదరంబున సనత్కుమారుం డిట్లు చెప్పం దొడంగె:—

నారదా! స్వనాభికమలోద్భవుండగు బ్రహ్మను శ్రీమన్నారాయణుండు పిలిచి సృష్టియొనర్పుమని యాజ్ఞనొసంగ, తమోగుణప్రభావమున దైత్యులను సత్వగుణప్రభావమున దేవతలను సృజించెను. ఈయుభయులలో గయాసురుండను దైత్యవల్లభుఁడు తేజోబలరాసుల మిన్నయై వన్నెఁగాంచెను. వానిశరీరము నూటయిరువదియైదుయోజనముల పొడవును, అఱువదియోజనముల లావును గలదియై యొప్పుచుండెను. గయాసురుఁడు, తమోగుణప్రభావమునజనించినను, రాక్షసకృత్యంబులవిడనాడి శ్రీమన్నారాయణుని పాదారవిందమరందపానాయత్తచిత్తుండై, విష్ణుభక్తాగ్రేసరుండై, కోలాహలపర్వతశిఖరంబున వేవేలవత్సరములు శ్వాసబంధ మొనర్చి ఘోరతపముసలుప, తత్తపోవేగంబునకు దేవతలు తాళఁజా

లక విహ్వలచిత్తులై సంక్షోభించుచు, సత్యలోకమున కరిగి బ్రహ్మను జేరి, దేవా! గయాసురుని తపోవహ్నికి నిలువఁ జాలకున్నారము. మమ్ముద్ధరింపు మని పలువిధంబులఁ బ్రార్థించిరి. అపుడు భయాక్రాంతచిత్తులగు దేవతలను, తనకరుణా కటాక్ష వీక్షణంబుల ననునయించి, భయముడిపి సరస్వతీనాథుఁడు వారలఁ దోడ్కొని కైలాసశిఖరమున కరిగి మహాదేవునిఁ జేరి, విధిపూర్వకముగ పూజించి పలువిధంబులఁ బ్రార్థించి గయాసురుని తపఃప్రభావమును విన్నవించి, దేవా! పార్వతీమనోహరా! శరణాగతులమగు మమ్ము గయాసురుని బాఱినుండి వెలువఱచి రక్షింపుమని వేఁడుకొనిరి. మహేశ్వరుండు బ్రహ్మాదిదేవతలప్రార్థనల సంప్రీతుఁడై, మనమందఱము క్షీరసాగరశయనుని జేరి గయాసురవృత్తాంతమును విన్నవించి, రక్షింపుమని ప్రార్థింతము అతఁడుశరణాగతవత్సలుండు. ఆర్తత్రాణపరాయణుండు. ఆతండు మనల నీయాపత్సముద్రంబుననుండి వెలువఱచి రక్షించునని చెప్పుచు, బ్రహ్మాదిదేవతలతో రమాపల్లభునిసదనంబుఁ జేరి, దేవదేవా! సమస్తలోకంబులను బుట్టింపను, రక్షింపను, శిక్షింపను కర్తవగు నీకిదే వందనము. మహానుభావా! ముల్లోకముల కధిపతివై ప్రకాశించు నీకిదే నమస్కారంబు. దుష్టశిక్షణ శిష్టరక్షణ తత్పరుండవగు స్వామీ! నీకిదే ప్రణుతి. రాక్షసుల నాశముచేయు ప్రభువా! నీకిదే జోహారు. యోగజ్ఞ! నీకిదే కేలుమోడ్పు. అనంతకోటి బ్రహ్మాండంబుల కధినాథుండవగు జగన్నాయకా! నీకిదే యంజలి. అని స్తోత్రపాఠములు సలుపు మహేశ్వరాది దేవతల వీక్షించి లక్ష్మీకాంతుండు ప్రసన్నుండై, మీరలేలయిచ్చటి కరుదెంచితిరి? సవిస్తరముగా విన్నవింపుఁడు. మీ మనోరథంబు లొనగూర్చెద నని

సాదరముగాఁ బలికెను. అంతట గిరిజామనోహరుండు రమామనోహరునితో గయాసురుని తపోవేగమును సహింపఁజాలకున్నారము. వానిబారినుండి మమ్ముల రక్షింపు మనిచెప్పఁగా దేవహితకారియగు వాసుదేవుండు, భయాక్రాంతచిత్తులగు దేవతలతో, మీరలందఱు గయాసురునిపాలి కరుగుఁడు. నేనిదే మీవెనువెంటఁ జనుదెంచి మిమ్ముల రక్షించెదనని యభయదాన మొసంగి వారల ననిపెను. అంత టవిష్ణువు బ్రహ్మాదిదేవతలతో కోలాహలపర్వతమునఁ దపమునలుపు గయాసురునిపాలి కేగి, దానవోత్తమా! మేమిదే ప్రసన్నుల మైతిమి. నీతపోనియతికి మెచ్చితిమి. నీయభీప్సితంబుల నొసంగ మేమిదే సంతసంబున సిద్ధంబుగ నున్నారము. నీవలయుదాని కోరుమని యడుగఁగా, గయాసురుఁడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతోత్తములారా! మీరలు నాయందుఁ బ్రీతులైన యెడల నాశరీరము దేవ,బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, యజ్ఞ, తీర్థ, నదీనద పర్వతములకంటె, ఋషి, అవినాశశివ, బ్రహ్మజ్ఞాని ధర్మకర్మములకంటె శ్రేష్ఠమై, పవిత్రతరమై నెగడునటుల వరమొసంగుఁడని ప్రార్థింప వల్లెయని తమతమలోకముల కరిగిరి. అంతట విష్ణువరదానమహిమచే నతిపవిత్రమై, పుణ్యతమమై వెలయు గయాసురుని శరీరదర్శన స్పర్శనములవలన, సమస్త ప్రాణులు పాపరహితులై విష్ణుసాయుజ్యమునుఁ బొందుచుండుటవలన, మూఁడులోకములును జనశూన్యమయ్యెను. నిర్జనమగు తనపురంబును వీక్షించి విషాదమున నింద్రాదిదేవతలనుఁ దోడ్కొని ధర్మరాజు హిరణ్యగర్భునిఁజేరి, విష్ణునాభికమలోద్భవా! మున్ను నీవు సృష్టియొనర్చునపుడు, అష్టదిక్కుల నష్టపురంబులనిర్మించి వానిపాలనాధికారము మా కొసంగి

తివి. సమస్తప్రాణులును గయాసురుని దర్శనస్పర్శనములవలన పవిత్రులై వైకుంఠమున కరుగుచుండిరి. మాపురంబులు శూన్యంబులయ్యె. మే మెవరిఁ బాలింతుము. మాయధికారముల వలని ప్రయోజన మేమి? నీ వొసంగినయధికారమును గ్రహించి మమ్ముల జనసంకీర్ణస్థలంబుల కనుపు మని వేఁడుకొన, వారలం దోడ్కొని వైకుంఠమున కేగి జగన్నాయకా! గయాసురుని దర్శనస్పర్శనములవలన సమస్తప్రాణులు పాపరహితులై, పవిత్రవంతులై వైకుంఠపురంబునుఁ జేరుచుండుకతన లోకసంతతి జనశూన్యమయ్యె. దిక్పాలకులు విషణ్ణహృదయులైరి. వీరివిషాద మెవ్విధంబునఁ బాపనగు. లోకంబు లెవ్విధంబున జనసమృద్ధంబులగు? కరుణించి సెలవొసంగి మన్నింపవే యని వైకుంఠనాథుని సవినయముగ వేఁడుకొన, సాదరుండై, పితామహా! నీవే దేవగణములతో గయాసురునిపాలి కరిగి, యాగార్థ మతని శరీరమును యాచింపుము. అతఁడు తప్పక యొసంగు నని సెలవొసంగి గయాసురునిపాలి కనిపెను. ఇంద్రాది దిక్పాలకులతోఁ జనుదెంచిన సృష్టికర్తనుజూచి, అర్ఘ్యపాద్యాచమనీయాది షోడశోపచారంబుల విధ్యుక్తముగాఁ బూజించి, దేవా! నేఁడు నాజన్మము సఫలమయ్యె. నాతపంబు ఫలించె. నాయింటి కతిథివై చనుదెంచినకతన యజ్ఞాదికర్మములవలన లభించుఫలమనాయాసముగా నొనగూడె. యోగజ్ఞ! నీవు యోగులకు స్వామివి. వేదవేద్యుఁడవు. లోకముల కధిపతివి. సృష్టికర్తవు. అందఱకును దండ్రివి. గురుఁడవు నన్నుఁ గరుణించి నావలన నెట్టికార్య మొనగూడవలయునో సెలవొసంగి నాజన్మమును సార్థక మొనర్పుము. నీపనిచినకార్య మొనర్చుటకు సిద్ధముగ నున్నాఁడను. కరుణింపు మను గయాసురుని సభక్తికోక్తుల కలరి,

దైత్యాధిపా! నేను యజ్ఞార్థమై భూమియందలి తీర్థక్షేత్రముల న్నియుఁ జుట్టివచ్చితినిఁగాని, విష్ణువరప్రభావమున నతిపవిత్ర మగు నీశరీరమునకు సాటియగు పవిత్రస్థలము వేఱొండుఁగాన రాదు. కాన నేనోర్పంబూనిన యజ్ఞార్థమై నీశరీరంబొసంగుమని బ్రహ్మకోరెను. అంతట గయాసురుఁడు, నేధన్యుఁడనైతి. నాత లిదండ్రులు కృతార్థులైరి. నీచే సృజింపఁబడి, నీచే పరోపకారా ర్థమై పవిత్రముగాఁ జేయఁబడి, నీచే యాగార్థము కోరఁబడిన యీనాశరీరమును నీకిదె యర్పించుచున్నాఁడ నని చెప్పుచు, శ్వేతవరాహకల్పమందు, నైఋతికోణమాశ్రయించి, ఉత్తర దిశయందు శిరస్సును, దక్షిదిశయందు పాదముల నునిచి కోలా హలపర్వతమున శయనించెను. అపుడు బ్రహ్మ యాగసామగ్రి సమకూర్చి, అగ్నిశర్మ, అమృత, శౌనక, ప్రాంజలి, మృదు, కుమధి, వేద, కౌండిన్య, హరీత, కాశ్యప, కృప, గార్గ్య, కౌశిక, వాశిష్ఠ, మునిభార్గవ, మార్కండేయ, వృద్ధపరాశర, కణ్వ, మాండవ్య, శ్రుతికేవల, శ్వేత, సుతాల, దమన, కుహోత్ర, కర్క, మహాబాహు, లౌగాక్షి, జైగీషవ్య, దధి, పంచభూ, కర్కర్షభ, కాత్యాయన, గోభిల, మహావ్రత, మునిమిశ్ర, సుక పాల, గౌతమ, వేదశిరోవ్రత, జటామాలి, చాటుహాస, దారు, కా, త్రేయాంగీర, సౌపమన్య, గోకర్ణ, గుహావాస, శిఖండి, ఉమావ్రత ప్రభృతులగు ఋషివర్యులను, బ్రాహ్మణశ్రేష్ఠులను రావించి గయాసురశరీరముపై జన్నమొనర్ప నారంభించెను. ఋత్విజుఁడగు నగ్నిశర్మ పంచాగ్నుల (దక్షిణ, ఆహావనీయ, గార్హ్యపత్య, సభ్య, అవసథ్యాగ్నులు) నుత్పత్తి నొనర్చి య జ్ఞము సలుపుట కుపక్రమించెను.

## బ్రహ్మ యజ్ఞము చేయుట.

నారదా! యజ్ఞ ప్రతిష్ఠాపనసమయమున బ్రాహ్మణుల కనేకవిధముల దక్షిణాదిదానముల నొసంగె. బ్రహ్మ జన్నమును బూర్తిచేసి పూర్ణాహుతి నొసంగి యవభృథస్నాన మొనరించిన పిమ్మట గయాసురుఁడు చలింపమొదలిడె; అంతట బ్రహ్మ చకితహృదయుఁడై, ధర్మరాజా! నీగృహమందుండు శిలను గయాసురునిశిరమున స్థాపింపుమన, ధర్మరాజు చతురాననాజ్ఞానుసారముగ శిలనుస్థాపింప, శిలాసమేతముగాఁ గదలుచుండెను. అయ్యది చూచి బ్రహ్మాది దేవతలందఱు నాశిలపై నిలిచిరి. కాని గయాసురుఁడు కదలుట మానఁడయ్యె. సురజ్యేష్ఠుం డట్లు కదలుటచూచి భయమొంది క్షీరసాగరశయను శ్రీధరుం జేరి, లోకనాథా! నీకు నమస్కారములు. దేవా! నీవె సమస్తలోకములకుఁ బ్రభుఁడవు. యశస్వివి. అనిప్రార్థింపఁగా, విష్వక్సేనుఁడు దామోదరునితో, జనార్దనా! మిమ్ముఁ బరమేష్ఠిదర్శింప నిరీక్షించుచున్నాఁడన, విష్ణుండు విష్వక్సేనునితో పితామహుని నిచ్చటికిఁ దోడితెమ్మని వచింప తద్విధంబున వేధనుఁ బిలుచుకొనివచ్చిన, నారాయణుండుఁగాంచి, సరస్వతీనాథా! నీవిచ్చటికరుదెంచుటకు కారణంబేమనిన, విధి, యో దేవదేవేశా! గయాసురునియొడలిపై నేఁ జేయుజన్న మెపుడు పూర్తియయ్యెనో నాఁటనుండి యాతండు సాగుటకు మొదలిడ, ధర్మరాజునింటఁ జిరకాలమునుండియుండిన దేవరూపిణియను శిలను దచ్ఛిరముపై నుంచితిమిగాని శిలాసమేతముగాఁ గదలుచుండె. తదనంతరము రుద్రాదిసమస్త దేవత లాశిలపై నిలిచినను దత్ప్రాణసహితముగా గయాసురుఁడు చలించుట మానఁడయ్యె. అట్లు చలింపకుండెడి యుపాయమెద్దియో సెలవొసంగి కృతా

ర్థులను జేయుమన హృషీకేశుండు, తన దేహములోని యొక
కళను మూర్తినిగాఁ జేసి దానిని తద్గ్రీవంబుపై ప్రతిష్ఠఁ గా
వింపుమని విధికొసఁగి పనిచెను. తన్మూర్తిని గయాసురుని శిరం
బుపై స్థాపించినను తత్ప్రాణము చలింప మానదయ్యె. పద్మ
భవుఁడు భీతచిత్తుండై కేశవుని ప్రార్థింప, జనార్దన, పుండరీ
కాక్ష నామములఁ దాల్చి తచ్ఛిలపై నిలచి, గయాసురుని నిశ్చ
లార్థమై తా నాదిగదాధరునామమున స్థాపితుఁడయ్యె. ఇంక
నుఁ గదలునేమో యనుభయమున పరమేష్ఠి, పితామహ,
ప్రపితామహ, పల్గ్వీశ, కేదార, కనకేశ్వరులను పంచమూర్తు
లను ప్రతిష్ఠించి తానుఁ గూడ నిలిచెను. విఘ్నేశ్వరుఁడు గజ
రూపముతోను, సూర్యుఁడు, గయాదిత్యోత్తరార్క దక్షిణా
ర్కులను నామములతో త్రిస్థలములందును, లక్ష్మి, సీత, మంగ
ళ యను నామములతో రెండుస్థలములయందును, గాయత్రి,
సావిత్రి, సరస్వతి యనునామముల త్రిస్థలములయందు త్రిసం
ధ్యలును, ఇంద్రుఁడు, బృహస్పతి, పూషుఁడు, అష్టవసువులు,
సర్వమునులు, విశ్వేదేవులు, అశ్వినీకుమారులు, విశ్వనాయ
కుఁడు, వాయువు, గంధర్వ, యక్ష సర్పకిన్నరాది దేవగణ
ములు తమతమశక్తిస్వభావములతో శిలపై నిలిచిరి. ప్రప్రథమ
మున, శ్రీకాంతుఁడు గదాయుధమును చేఁబూని గయాసురుని
మూర్ధమందున్నశిలపై నిలిచి నిశ్చలత్వమొసఁగినందున, గయా
క్షేత్రమందు దామోదరుఁడాది గదాధరనామమున ఖ్యాతిఁ
గాంచెను. ఇవ్విధంబునఁ దమతమ శక్త్యాయుధములతో శ్రమ
మొసంగు నాదిత్యులనీక్షించి, మీరలెందుకొఱకు నాకీదుఃఖ
ము నొసంగుచున్నారు. ఈనాపవిత్రశరీరమును బ్రహ్మయొ
నర్చ యాగార్థమై సంతసంబున సమర్పించితినిగదా! అట్టి

సమయమున, నాప్రభువగు జనార్దనుని యాజ్ఞయగునెడ, నిశ్చలముగా నిలువకుందునా, నాశరీరమునకు పీడయొసంగుటయే మీయభిమతమగునెడ, మీరు నాయందుఁ బ్రసన్నహృదయులరైన, నేనీశిలతో నిశ్చలముగా నిలిచెద ననుగయాసురునిపలుకుల నాలకించి, సురవరులు సంతుష్టహృదయులై, దానవోత్తమా! నీపలుకులు విన మాకు సంతసమయ్యె. నీకోరిక లొనఁగూర్ప సిద్ధముగా నుంటిమి. ఎట్టిఁగింపుమనిన, ఎంతకాలము, పర్వతనదీసహితముగా పృథ్వియు, సూర్యచంద్రతారాగణములు నిలిచియుండునో, అంతవఱకు నాశిరమునందలి ధర్మశిలపై, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవవర్యులు నివసించియుందురుగాక. ప్రళయమువఱకు నాపేరున నీక్షేత్రము (గయాక్షేత్రము) ప్రఖ్యాతిఁగాంచుఁగాక. పంచక్రోశాత్మకమగు నీక్షేత్రమున క్రోశమాత్ర పరిమితిగల నాశిరమునందు, త్రిలోకములయందలి తీర్థములు, గంగాదిపవిత్ర నదులు, పుష్కరములు, దేవతలు నివసించి నిరంతరము మానవులకు మోక్షమొసంగుచుందురుగాక. ఈస్థలమందు స్నాన, తర్పణ, పిండదానము లొనర్చుమనుజులు తమతమ పితరులతో మోక్షము నొందుదురుగాక. ఎంతవఱకు శ్రీమహావిష్ణువు త్రిమూర్త్యాత్మకమునఁ బ్రఖ్యాతిఁ గాంచుచుండునో, అంతవఱకు నీక్షేత్రము గయాక్షేత్రమను నామమున విరాజిల్లుఁగాక. ఈక్షేత్రమందు నేమనుజుఁడు పిండదానమొనర్చునో, ఆమనుజుఁడు సహస్రకులములవఱకు తనపితరులఁ బవిత్రులఁజేసి సద్గతి నొందుగాక. సురవరులారా! మీరందఱు నీక్రోశాత్మకమగు నాశిరమునఁ బ్రకటాప్రకటరూపముల నిరంతరము నివసించియుందురుగాక. ఈక్షేత్రమందు గదాధరనామమున నొప్పు

పద్మనాభునిc బూజించుమనుజుల దోషసంచయము నశించుc గాక. ఈక్షేత్రమందుc బిండాత్మక శ్రాద్ధమొనర్చు మనుజులకు సత్యలోకప్రాప్తి యగుcగాక. ఈక్షేత్రమున నివసించుమనుజులకు బ్రహ్మహత్యాది మహాపాతకములైన నంటకుండుcగాక. నైమిశారణ్య, పుష్కర, గంగా, ప్రయాగక్షేత్రములయందును, స్వర్గ, మర్త్య, పాతాళములయందు ప్రఖ్యాతిcగాంచుసర్వతీర్థములు ఈక్షేత్రమందు నివసించి సదా మానవులకు హితమొనర్చుచుండుcగాక. మఱియు మీలో నెవరైన నీస్థలమందు నివసించనిచో నేను స్వేచ్ఛగా విహరింతుcగాక. ఈ నాహితంబు లోనగూర్ప మీకు సంతసమగునెడ నొడcగూర్పుcడని గయాసురుcడు మిన్నకుండెను. మనుజహితములగు గయాసురునివరములనుహర్షచిత్తులై యాలకించి సంతసంబునవిష్ణ్వాదిదేవతలు, దానవోత్తమా! నీవరంబుల నొసంగితిమి. నీయభిమతానుగుణముగ జరుగcగలదు. నిశ్చయము. అందులకు సందియములేదు. ఇచ్చట, పిండదానముగాని, శ్రాద్ధముగాని, యజ్ఞాదిక్రతువులుగాని సలిపినమనుజుcడు నూఱుకులములపితరులతో రోగరహితుcడై బ్రహ్మలోకమునుcబొందును. ఇచ్చట నివసించుదేవతలను భక్తియుక్తముగాc బూజించుమనుజుcడు సద్గతివడయును. దేవతలు తన మనోరథము లోనగూర్చినపిదప గయాసురుcడు నిశ్చలుcడయ్యెను. గయాసురుని మూర్ధమందుండు ధర్మశిలపై దేవతలు నిలిచిరి. అంతట హిరణ్యగర్భుcడు పంచక్రోశాత్మకమగు గయాక్షేత్రముతో బ్రాహ్మణులకు నేcబదియైదుగ్రామములు, సంపూర్ణసామగ్రులతో నసంఖ్యాకములగు సుందరమందిరములు, కామధేనువు, కల్పవృక్షము, పారిజాతము, క్షీరనది, దధిఘృత మధుకుల్యలు,

రజతసువర్ణదీర్ఘికలు, అన్నపర్వతములు, భక్ష్యభోజ్యఫలాది కరాసుల నొసంగి, మీసౌకర్యములకు సమస్తపదార్థముల నొసంగితిని. మీర లేరిని నే పదార్థమును యాచింపక భగవద్భక్తిపరాయణులై దయాంతరంగహృదయులై సుఖంబుననుండుఁడని శాసించి, ఆదిగదాధరునకు ప్రణుతులొనర్చి బ్రహ్మతనస్థానమున కరిగెను

పిమ్మట, నారదా! గయాక్షేత్రమున కరుదెంచిన ధర్మరాజుచే ధర్మారణ్యమందు, ఈబ్రాహ్మణులు విధ్యుక్తముగా యాగమును జేయించిరి. యాగానంతరమందు, ధర్మరాజు, ఋత్విక్కులగు బ్రాహ్మణులకు దక్షిణలీఁబోఁగా, తమకు పితామహుని వరప్రభావము సమస్తైశ్వర్యములు గలవని స్వీకరింపక నిరాకరించిరి. బ్రాహ్మణులకు దక్షిణలొసంగమిని, తానొనర్చినయాగము ఫలరహితమగునని ఖిన్నహృదయుఁడై, ధర్మరాజు సయుక్తికముగా తాంబూలమందు రత్నాదికముల నిమిడ్చి బ్రాహ్మణులకు పంచియిచ్చెను.

ధర్మరాజొనర్చిన యాగధూమ మష్టదిక్కులవ్యాప్తమై సత్యలోకముచేరుటవలన, గయాక్షేత్రనివాసులగు విప్రులు, సమస్తైశ్వర్యములు గలిగినను, ధనలోభమున ధర్మరాజువలన దక్షిణాదికములు గ్రహించుట గ్రహించి, బ్రహ్మ కుపితుఁడై, గయాక్షేత్రమునకేగి, విప్రులంజీరి, మీకు నేను సమస్తైశ్వర్యముల నొసంగినను లోభగ్రస్తులై, దురాశాపీడితులై ధర్మరాజువలన దక్షిణాదికములు స్వీకరించితిరి. గాన, మున్నునావలన మీకొసంగఁబడిన కల్పవృక్షము, కామధేనువు, పారిజాతము తమతమస్థానములఁ జేరుఁగాత. అన్న, భక్ష్య, భోజ్యాదిరాసులు శిలాదికములగుఁగాత. స్వర్ణరజతపర్వతములు రాలుకొండ

లగుఁగాత. క్షీరనది, దధిమధుఘృతకుల్యలు నీరము లగుఁగాత. మీగృహములు మృత్తికావృతములై వెలయుఁగాత. అనియీ విధంబున బ్రహ్మపలుకు శాపవాక్కుల నాలకించి, దుఃఖితులై పలువిధంబులఁ బ్రార్థించి, పితామహా! నీవు మును మాకొసంగిన సొమ్ములన్నియు నిప్పుడొసంగినశాపమువలన వమ్ములయ్యె. ఇఁక మే మెట్లు జీవించఁగలము? ఏది తెఱవు? కరుణింపవేయని విలపించు బ్రాహ్మణులనుజూచి, ప్రసన్నుఁడై భూసురులారా! సూర్యచంద్రాదులు ఎంతకాలము నిలిచియుందురో యంతకాలము ఈగయాక్షేత్రమందు నివసించుచు, ఈక్షేత్రమునకేతెంచి తనపితరులమోక్షార్థమై యేమనుజుఁడు పిండదానమొసంగి, మిమ్ములఁబూజించి, దక్షిణతాంబూలములొసంగి తృప్తిపఱచునో, యామనుజుఁడు తనపితరులతో సద్గతివడయుఁగలఁడు. ఏమనుజుఁడు ఈక్షేత్రమందు మిమ్ములఁ బూజించునో, యామనుజుఁడు నన్నుఁబూజించినటుల సంతసించి వాని మనోరథంబులొడఁగూర్చుచుండెద నని వరమొసంగి తనస్థానమునుఁ జేరెను.

గయాసురుని యుదరభాగమున ధర్మరాజు స్థాపించిన విరజపర్వతమందు, గయాసురుని నాభిరూపకూపసమీపమున విరజాదేవి నిలిచియుండె. ఈస్థలమందు పిండదానమొనర్చిన నిరువదియొక్క కులములు తరించును. గయాసురుని పాదములయందు స్థాపింపఁబడి నిశ్చలత్వమొందిన మహేంద్రపర్వతమందు పిండదానమొనర్చిన నేడుకులములు తరించును.

## ద్వితీయాధ్యాయము.

# తృతీయాధ్యాయము.

నారదుఁడు, శౌనకాది మహర్షులతో సనత్కుమారుని వలనఁ బుణ్యతమమగు గయాసురుని చరితము నాలకించి, మహాత్మా! గయాసురుని శిరమునందుంచఁబడిన శిల యేప్రకారము ముత్పన్నమైనది? అయ్యది యెట్టిమాహాత్మ్యముగలది ? దాని స్వరూపమెట్టిది? దాని పేరేమ్యది? ఈవృత్తాంతమును సవిస్తరముగా సెలవొసంగి మమ్ముఁ గృతార్థులఁ జేయుఁడని ప్రార్థింప, సనత్కుమారుండు సంతోషతరంగితాంతరంగుండై యిట్లు చెప్పఁదొడంగె.

నారదా! నీవడిగిన శిలావృత్తాంత మతిపవిత్రమైనది. అద్దానిఁ జెప్పుటకు నాకును హర్షమయ్యె చెప్పెద సావధానులరై యాలింపుఁడు. మహాతేజస్వియు, సమస్తశాస్త్రపురాణేతిహాస పారంగతుండును, వేదవేదాంగనిరతుండును, బహుతపోధన సంపన్నుండునునగు ధర్ముఁడను ఋషివరుం డొకఁడు గలఁడు. ఆయన ధర్మపత్ని విశ్వరూప. విశ్వరూపాధర్ముల తపఃఫలంబోయన, నిరుపమాన సౌందర్యరాశియై, సకల సద్గుణసమన్వితయై యపరలక్ష్మియో యననొప్పు ధర్మవ్రతానామకకన్యారత్నంబొండు జన్మించె. ధర్మవ్రతయందుఁగలసద్గుణరాశి ముల్లోకములయందును మఱియొకకన్యయందుఁ గానరాదు. ధర్మవ్రతయందు వివాహయోగ్యత పొడసూప, ననురూపవరాన్వేషణలాలసుఁడై లోకత్రయముం దిరిగి తిరిగి, యనుకూలవరప్రాప్తి కలుగమికి విచారించి, ధర్ముఁడు తనగారాబుఁగూఁ

తు రావించి, తల్లీ! అనురూపవరప్రాప్తికై యరణ్యమున కరిగి తపమాచరింపుమని చెప్పెను. అంతట ధర్మవ్రత పిత్రాజ్ఞ శిరమునందిడుకొని వనమున కరిగి, మున్నెవరును సలిపియుండని నిష్ఠతో ఘోరతపము సలుపుచుండెను.

సహస్రయుగపర్యంతము వాయుభక్షణమొనర్చి తపము సలిపిన బ్రహ్మమానసపుత్రుఁడను ప్రసిద్ధివడసిన మరీచి, పితృసందర్శనలాలసుఁడై సత్యలోకమున కరుగ, తనపుత్రునిఁ గాంచి సంతసించి, నీవు గృహస్థాశ్రమము స్వీకరించి సంతతినిడయుమని విధి సెలవొసంగెను. అంతట మరీచి, పితృవాక్యానుసారముగ సకల సద్గుణసమన్వితయగు కన్యకొఱకు చతుస్సముద్రముద్రితంబగు భూచక్రమంతయుఁ దిరిగి తిరిగి, తపోనియతినున్న ధర్మవ్రతనుదిలకించి, ఆహా! ఈకన్యారత్నము రూపయౌవనలావణ్యంబుల నగణ్యయై యొప్పుచున్నయది. చూడఁజూడ నా కనురూపవతిగా నున్నయది యని తలంచుచు, ధర్మవ్రతను సమీపించి, కన్యారత్నమా! నీవెవరిదానవు? నీతలిదండ్రులెవరు? నీయభీప్సిత మెద్ది? ఎందుకొఱ కిట్టి ఘోరతపమున నీకునుమకోమలగాత్రమలయించుచుంటివి? సుగుణపుంజమా! నీరూపరేఖా విలాస సంపదలఁజూచి మోహితుఁడనైతి! నేను బ్రహ్మమానసపుత్రుఁడను. నన్ను మరీచియందురు. నేను సమస్త వేదములను, తదంగములనుబఠించినాఁడను అన్నివిధముల నీ కనురూపుఁడను. నాకరమును చేపట్టుమని మరీచిపలుక, మునివరా! నేను ధర్మపుత్రిని. ధర్మవ్రత యనుపేరు గలదానను. విప్రోత్తమా! ఉత్తమవరప్రాప్తికై యిటుల తపమాచరించుచుంటిని. నామనోరథ మనుకూలించువఱకు, ఇట్టి దారుణతపస్సమాధినిరతి నుండుదునని ధర్మవ్రత సవినయముగాఁబలికెను. ఈపలుకులనాలించి, మరీచి

ధర్మవ్రతతో సహర్షముగా, నాదర్శనమువలన నీమనోరథము సిద్ధియైనదని తలంపుము. నేనుగూడ కన్యార్థినై రేయింబవళ్లు భూచక్రమంతయు చుట్టి ప్రదక్షిణముచేయుచుంటిని. నీమనోరథసిద్ధియైనది. నన్నుఁ జేకొనుము. ఈలోకమందు నీవంటికులశీలములుగలకన్య నేఁబొందుఁ గానరాదు. నావంటివరుఁడు నీకు దొరఁకుటయు దుర్లభము. కాఁబట్టి ధర్మవ్రతా! ధర్మపుత్రీ! నన్నుఁదప్పక పరిగ్రహింపుము. అని నుడువు మరీచినిజూచి, ధర్మవ్రత సవినయముగా, భూసురవర్యా! నేనుస్వతంత్రనుగాను. తలిదండ్రులచాటుదానను. మీయభిప్రాయమును మాతండ్రికెఱిఁగింపుఁడని హెచ్చరించెను. మరీచిధర్మవ్రతవచనమునుఁగైకొని ధర్మునిఁజేరెను. మహాతేజస్వియు, తపోధనరాశియునగుబ్రహ్మమానసపుత్రునిఁజూచి నమస్కరించి యాసనమొసంగి, షోడశోపచారంబుల విధ్యుక్తముగాఁ బూజించి, నాజన్మము సఫలమయ్యె. నాగృహము పావనమయ్యె. తాముదయచేయుకార్యమెద్దియో యెఱిఁగించి నను మన్నింపుఁడనిధర్ముఁడుప్రార్థించెను. ధర్ముని సాదరవాక్కుల కలరి, మరీచి, ధర్మవరా! నేనుకన్యార్థినై పృథ్వీతలమంతయుఁ దిరిగితిరిగి సద్గుణరాశియగు మీపుత్రికారత్నమునుఁ దపోనియతినుండఁ గాంచితి నా కక్కన్యారత్నము నొసంగి వివాహమొనర్పుము. మీ కనంతపుణ్యఫలము లభించునని సభక్తికముగా నడిగెను. ధర్ముఁడు మరీచి వాక్కుల కమితానందమునుఁ బొంది, మంచిది నా కొమరితను తమకొసంగి తప్పక వివాహము సేయుదునని చెప్పి, తపోనియతినుండుతనకూఁతురావించి, వివాహమొనర్చి, సతీధర్మముల నుపదేశించి మరీచివెంట ననిపెను. అంతమరీచి వివాహాగ్నితో, తన ధర్మపత్నియగు ధర్మవ్రతతో తనయాశ్రమమును జేరి, విష్ణుపు

లక్ష్మితో, నీశ్వరుఁడు పార్వతితో, బ్రహ్మసరస్వతితోఁ నెట్లు గృహా శ్రమమందు శోభిల్లిరో, యట్లు మరీచి ధర్మవ్రతతో శోభిల్లుచు శ్రీకుమార సదృశులగు కుమారుల నూర్గురనుఁ గాంచెను. అంత నొకానొకదివసమున, మరీచి ఫలపుష్పసంగ్రహమున కరణ్యమునకరిగి కడుఁ డస్సి గృహంబున కేతెంచి, నిత్యకర్మలనుష్ఠించి, భోజన మొనర్చి, తనభార్యం జీరి నేఁడు మిక్కిలి శ్రమచెందితి. ఆయాస మధికముగానుండె. ఒక్కింతతడవు నా పాదముల నొత్తుమని చెప్పుచు శయనించెను. అంతట ధర్మవ్రత పతినాజ్ఞఁ దలనిడి పాదంబులకు ఘృతలేపనమిడి తదేకచిత్తంబునఁ బాదంబుల నొత్తుచుండ మరీచి నిద్రాపరవశుండయ్యె అంతట పితామహుండు తదాశ్రమప్రాంతమునకు చనుదెంచుట ధర్మవ్రతచూచి, యాశ్రమమున కేతెంచిన యతిథిని సభక్తికముగాఁ బూజింపక నిరసించుటయు, భర్తృనాజ్ఞ వీడుటయుఁ దగదని విచారించి, యేమిచేయుటకును దోఁచక, యెట్టకేలకు వేదవేద్యుండును, సృష్టికర్తయు, తనకు మామయునగు సరస్వతీనాథునిఁ బూజించుటయే తగుకర్తవ్యమని నిశ్చయించి, పతిసేవ వీడి, ఆసనమిడి విధ్యుక్తముగాఁ బూజించి, తల్పమొసంగి మార్గాయాసము వాయునటుల పాదసేవ సేయుచుండెను. అంతట మరీచి నిద్రనుండి మేల్కాంచి, తనసతి తన నియమితకార్యమును వీడి, యాజ్ఞోల్లంఘన మొనర్చి యన్యసేవాపరతంత్రయగుటగాంచి, పట్టఁజాలనికోపంబున, పరపురుష సేవాపరతంత్రురాలా! పాపాత్మురాలా! నీవు నాయాజ్ఞ నుల్లంఘించి, నా సేవవీడి, యన్యసేవాయత్తచిత్తనైతివిగాన, నీవు కఠోరగ్రావంబవై నిలువవలయునని శాప మొసంగెను. నిర్హేతుకముగా ముందువెనుక లాలోచింపక, కేవల క్రోధమానసుఁడై శాపమొ

సంగిన తనపతింజూచి స్త్రీస్వభావమును వీడనేరక, కోపావేశం బున మీరు నిద్రాపరతంత్రులై యుండ మీతండ్రి చనుదెంచె ను. మీకు నిద్రాభంగము కలుగకుండ మీరు మీతండ్రికిఁ జే యవలయు శుశ్రూష నేనొనర్చితిని. ఇందుల నానేరమెద్ది? నిర్దోషినగు నన్ను వృధా శాపానలంబునఁ బడఁద్రోచితిరిగాన, మిమ్ముల నవశ్యము పార్వతీమనోహరుఁడు శాపదగ్ధులనుగాఁ జేయుఁగాతమని ప్రతిశాపమిచ్చుచుంటినని పల్కెను. తనకు నిర్హేతుకముగా పతియొసంగిన శాపమునకును స్త్రీస్వభావమునఁ గోపమాపఁజాలక పతికిఁ దానొసంగిన ప్రతిశాపమునకును, మిక్కిలిగఁ జింతించి, సేయునదిలేక నిద్రావస్థయందుండు తన మామకు నమస్కరించి, గార్హపత్యాగ్నియందు నిలిచి దారుణతపము సలుపుచుండెను. మరీచియు తనసతి యొసంగిన శాపమునకు వగచి ఘోరతపము సలుపుట కుపక్రమించెను. పతివ్రతాతిలకమగు ధర్మవ్రతయొక్కయు, మునిపుంగవుఁడగు మరీచియొక్కయు తపోవహ్నికిఁ దప్పులై తాళఁజాలక, సురజ్యేష్ఠుని వెదకి వెదకి విసికి యెందునుంగానక దేవతలందఱు గోవిందునిఁజేరి, దైత్యాంతకా! భక్తవత్సలా! ధర్మవ్రత యొనర్చు తపమునకు లోకత్రయము బాధపడుచుండెను. రక్షింపుమని వేఁడు నింద్రాదిదేవతలనుఁ దోడ్కొని జగద్రక్షకుఁడు ధర్మవ్రతచెంతఁజేరి నిలిచెను. బ్రహ్మయు నిద్రనుండిలేచి నారాయణునిగలిసెను. గార్హపత్యాగ్నియందు నిలిచి యేకాగ్రచిత్తంబునఁ దపమొనర్చు ధర్మవ్రతం దిలకించి, పతివ్రతా! మరీచి ధర్మపత్నీ! ధర్మవ్రతా! నీవలె నెవ్వారు నగ్నియందు నిలిచి యిట్టి యుగ్రతపమునాచరించి యుండలేదు. ఎందుకొఱకు నీవిట్టితపము సలుపుచు లోకములకు భయమొసంగుచుంటివి. ఇదె మే

ము ప్రసన్నులమై నీకోరినవరంబుల నీయ సిద్ధంబుగ నుంటిమి.
వెలిఁబుచ్చుమని యాశ్రితావనలోలుఁడు రమామనోహరుఁడు
వచించెను. అంతట ధర్మవ్రత యిందిరావల్లభు వచనామృతము
ను వీనులవిందుగఁ గ్రోలి, భక్తజనభాగధేయా! నేను నాపతి
శాపమునకు వెఱచి, విముక్తిఁ గాననేరక యిట్టితపోనియతి
నుంటిని. నాయందు దయాంతరంగ హృదయులరైతిరేని
నను నాపతి శాపానలమునఁబడనీయక రక్షింపుడని ప్రార్థించెను.
వాసుదేవుండు ధర్మవ్రతనుడువుల నాలించి, ధర్మవ్రతా! మ
హాతేజస్వి, బహుకాల తపస్సంపన్నుఁడు, ఋషిసత్తముఁడు, బ్రహ్మ
మానసపుత్రుఁడు నీపతియునగు మరీచి యొసంగిన శాపం
బును దొలఁగింప మే మశక్తులము. ఇదిగాక పతివ్రతాశిరో
మణీ! వేదవిహిత ధర్మంబులకు వ్యతిరిక్తము గానట్టికోరికల
నేమి కోరినను నొసంగఁ గలవారము. యాచింపుమని
హెచ్చరింప, ధర్మవ్రత సంతసించి, దేవతోత్తములారా!
ఇంద్రాది దిక్పాలకులారా! ఋషివర్యులారా! మీరు
నాపతి యొసంగిన శాపమును మరలింప నశక్తులరైన
యెడ, నేను ముల్లోకంబుల నతిశ్రేష్ఠమై, నదీనదతీర్థ
పుష్కర సాగరసరోవర దేవర్షి మునిముఖ్యులకంటె నతిపవి
త్రమై వెలయు శిలారూపమునుఁ బడయవలయు. త్రిమూర్త్యాది
సర్వదేవతలు, సర్వతీర్థములు నాశిలారూపశరీరమందుఁ బ్రక
టాప్రకటరూపములు వసియింపవలయు. నాశిలారూప శరీరద
ర్శన స్పర్శనములవలన సమస్తజీవములు, జన్మజన్మాంతరములం
దు, జ్ఞానాజ్ఞానములచే నొనరించిన మహాపాతకోపపాతకముల
నైన వీడి పవిత్రులై ముక్తినొందవలయు. నాశిలారూప శరీర

మందు స్నాన, తర్పణ, జప, తపో హోమాది కర్మములుగాని, పిండాత్మకశ్రాద్ధమునుగాని యెవరు భక్తిశ్రద్ధలతో సలుపుదురో వారు, వారి పితరులతోఁగూడ విష్ణులోకమునొందవలయు. సమస్తతీర్థములలో నుత్తమోత్తమమై, పవిత్రవంతమైన నా శిలారూప శరీరతీర్థమందు శ్రీమహావిష్ణువు, ఆచంద్రతారార్కముగానివసించి, ఆదిగదాధరనామమునఁ బ్రఖ్యాతివహించి, యాతీర్థమందునెవరు భక్తి శ్రద్ధలతో తమపితరులఁగూర్చి పిండదానమొసంగి తన్నుఁబూజింతురో, వారికి వారిపితరులతో ముక్తి నొసంగవలయు. జరాయుజ (చేతనములు) అండజ (పక్షులు, సర్పములు) స్వేదజ (నల్లి దోమ) ఉద్భిజా (వృక్షములు) దులు నాశిలారూపశరీరమున దేహత్యాగ మొనర్చిన యెడ సాయుజ్య మొసంగవలయు. నాశిలారూపశరీరమందు స్నాన, తర్పణ, శ్రాద్ధాదికము లొనర్చిన మనుజులు, యజ్ఞాదిక్రతువులవలన లభించు ఫలమునుఁబొంది యక్షయ పుణ్యలోకప్రాప్తి నొందవలయు. నాశిలారూప శరీరమందు, క్షీరాన్నము, ఘృతము మొదలగుపదార్థములతో హవన మొనర్చు మనుజులు శీఘ్రకాలమున సిద్ధినొందవలయు నా శిలారూప శరీరమందు శ్రాద్ధమొనర్చిన మనుజుఁడు సహస్రకులములతో సద్గతి నొందవలయు. మఱియు సురవరులారా! పవిత్రమగునదులు, సరోవరములు, సముద్రములు, పుష్కరములు, శ్రీమహావిష్ణుపుత్రిమూర్త్యాత్మకమునఁ బొగడ్తగనునంతకాలము, దేవర్షి గంధర్వ యక్ష కిన్నర గణములతో నాశరీరమందు నివసింపవలయు. యజ్ఞము, హోమము, జపము, తపము, స్నానము, తర్పణము, శ్రాద్ధము నాశరీరమందు సలుపు మనుజులు అక్షయ పుణ్యలోకములు పొందవలయు. దేవవర్యులారా!

ఈవరములు మీరు నాకు దయాంతరంగులై దయచేసిన యెడ, బ్రహ్మాండములు నిలిచియున్నంతకాలము నదీనద పర్వతములతో నేనీశిలారూపశరీరమున స్థిరముగానిలిచియుందును. ధర్మవ్రతవాక్యములకు సురవరు లలరి, నీవు కోరినవరముల నొసంగితిమి. నీశిలారూప శరీరము గయాసురునిశిరమునం దెపుడు స్థాపింపఁబడునో, యది మొదలు మేము పాదాదిచిహ్నములతో నీశరీరముపై నివసించెదము. ఇవ్విధంబున శిలారూపమగు ధర్మవ్రతకు వరదానమొసంగి సురవరు లంతర్ధానమైరి.

తృతీయాధ్యాయము.

---

# చతుర్థాధ్యాయము.

---

సనత్కుమారుండు నారదునిఁ జేరి, మునిశ్రేష్ఠా! దేవతలుగూడ గానముసేయు నీపవిత్రశిలామాహాత్మ్యమును జెప్పెదను. సావధానుండవై శ్రద్ధాభక్తుల నాలకింపుము. దేవరూపిణి యగు పవిత్రమైన యీశిల పృథ్వియం దెపుడు స్థాపింపఁబడినదో, అది మొదలు "విచిత్రశిల" యను నామమున లోకత్రయమందు వెలుగొందుచుండెను. విచిత్రశిలాస్పర్శమునలన సమస్తప్రాణులు దోషరహితులై, పవిత్రులై విష్ణులోకమునుఁ జేరుచుండుకతన లోకంబులు నిర్జనములయ్యె. జనశూన్యమైన తనపురంబునుఁజూచి ఖిన్నుఁడై, యముఁడు సత్యలోకమున కరిగి బ్రహ్మనుఁజూచి, నమస్కరించి పితామహా! విచిత్రశిలాస్పర్శమునలన మనుజులు త్యక్తపాపులై వైకుంఠమునుఁ జేరుచుండిరి. లోకంబులతో నాపురంబును శూన్యమయ్యె. నీవు నాకొసంగిన యధికారదండములవలనఁ బ్రయోజనముగానరాదు; కాన గ్రహియింపుమని విన్నవించెను యమునివాక్యములను సాదరంబునఁ జతురాననుఁడు చెవినిడి, విచిత్రశిలనుచేకొని నీగృహమునునుంచి నీయధికారమునం దప్రమత్తుఁడవై యుండుమనియాజ్ఞ నిడ, తత్ప్రకారమున యముఁడు విచిత్రశిలను దనగృహమున నిడి పాపకర్ముల శాసించుటయందుఁ దనయధికారమును వినియోగించుచుండెను. తత్ప్రభృతి విచిత్రశిల దేవరూపిణి యని ప్రసిద్ధివహించెను ఇట్టి మాహాత్మ్యముగల దేవరూపిణి, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులమూడ్కి-

మేరుశిఖరంబుంబోలె శ్రేష్ఠమై, పవిత్రమై, త్రిజగంబుల యందుఁ బ్రఖ్యాతిఁగాంచెను దేవరూపిణి, యతివిశాలమై గురుతరమై భారవహమై నెగడుకతంబున గయాసురుని నిశ్చలత్వమునకుఁ దచ్ఛిరమునందు స్థాపింపఁబడియెను. ఈయుభయ పవిత్రవస్తువులసంయోగము పితృముక్తికిఁ గారణమై యొప్పుచున్నది. ఈయుభయపవిత్రసంయోగస్థలమం దజుఁడు, అశ్వమేధయాగ మొనర్చెను. యాగకాలమున హవిర్భాగములను చేకొనఁ జనుదెంచు విష్ణ్వాది త్రిదశుల దేవరూపిణియగు ధర్మశిల తిలకించి, మీఁదలిందు వసియించి, యిందు శ్రాద్ధాది కర్మము లొనర్చుమనుజులకు, పిత్రాదివర్గంబులతో మోక్షమొసంగుచుండు నటుల వరమొసంగుఁడని ప్రార్థింపవల్లెయని తచ్ఛిలపై మూర్తిరూపముగాను, పదరూపముగాను ప్రకటా ప్రకటముగ వాసము చేయుచుండిరి.

### ముండపృష్ఠపర్వతము.

గయాసురుని ముండపృష్ఠభాగమందు ధర్మశిలస్థాపింపఁబడి ముండపృష్ఠాద్రియని ప్రఖ్యాతిఁగాంచి పితరులకు బ్రహ్మలోక మొసంగుచున్నయది.

### ప్రభాసపర్వతము.

ఇది ధర్మశిలాపాదభాగమందు స్థాపింపఁబడినది అందు ప్రభాకరుఁడు ప్రకాశించుచుండుకతంబున తత్పర్వతమునకు ప్రభాసపర్వతము, ప్రభాసక్షేత్రమును నామములు కలిగెను. ప్రభాసపర్వతమును భేదించి శిలపాదాంగుష్ఠములు బయలువెడలెను. దక్షిణపాదాంగుష్ఠమందు ఈశ్వరుఁడు వసియించి ప్రభాసేశనామమునఁ గీర్తివడయుచుండెను.

## ప్రేతశిల.

ధర్మశిల (గయాసుర) వామపాదాంగుష్ఠము నందున్న పర్వతమును ప్రేతశిల, లేక ప్రేతపర్వతము అని వాడుదురు. ఈపర్వతమును ప్రేతత్వమువహించి పాపాత్ములాశ్రయించి వాసము సేయుచుండుకతన, పాపభూయిష్ఠమై యొప్పుచుండ, తత్పర్వతమును ధర్మరాజు తనపాదాంగుష్ఠముచే దూరము గావించెను. ధర్మరాజు పాదసంసర్గమువలన ప్రేతపర్వతము ప్రేతలతోఁ పవిత్రమైనది. అందుదివ్యులు వాసముసేయుచున్నారు ఈస్థలమున పిండదానమొనర్చిన పితరులు ప్రేతత్వము వీడి దివ్యులగుదురు. గయాక్షేత్రమందు పితృముక్తికొఱకు పిండదానమొసంగు మనుజులకు విఘ్నము లొనఁగూర్చుప్రేతలు విస్తారముగా నున్నందున తత్పరిహారార్థ మాప్రేతలకు బలిదానమొసంగవలయును. ధనుర్ధారిరూపమునఁ బ్రేతలు బలిని గ్రహించును.

## శ్రీరామతీర్థము.

ప్రభాసపర్వత సమీపమున నున్ననదియందు, సీతాసమేతముగా స్నానమొనర్చిన శ్రీరామచంద్రుని నదిచూచి, నీవు స్నానమొనర్చిన యీస్థలము శ్రీరామతీర్థమను నామమున విఖ్యాత మగునటులను,

"శ్లో. రామతీర్థం తతోభూత్వా త్రిషు లోకేషు విశ్రుతమ్
జన్మాంతరశతం సాగ్రం యన్మయా దుష్కృతం కృతం
తత్సర్వం విలయం యాతు రామతీర్థాభిషేచనాత్
రామరామమహాబాహో దేవానామభయంకర
దేవేశ త్వాం నమస్యేహం మమనశ్యతు పాతకమ్."

అను మంత్రమునుఁ బఠించుచు నిందు స్నానమొనర్చి శ్రాద్ధముసేయుమనుజులకు పితరులతో విష్ణులోక మొనగూడు నటుల వరమొసంగుమని ప్రార్థింప నట్లె యగునని వరమొసంగి శ్రీరాముఁడు సీతాసమేతముగా భరతాశ్రమమున కరిగి, అందు నివసించుచుండెను. శ్రీరామ వరప్రభావమున లోకవిఖ్యాతమగు శ్రీరామతీర్థమందు స్నానమొనర్చి సపిండశ్రాద్ధ మొనర్చు మనుజులు పితరులతో విష్ణులోకమున కరుగుదురు. అట్లు రామతీర్థమందు స్నానమొనర్చి, పిండదానమొసంగి, అచ్చట నెలకొనియున్న ప్రభాసేశునిఁ బూజించి, జలస్వరూపుఁడవు, జ్యోతిస్వరూపివగు స్వామీ! నేను మనోవాక్కాయకర్మములచే నొనర్చిన పాపములను నశింపఁజేయుమని నమస్కరించి ప్రార్థింపవలయును.

"శ్లో. ఆపస్త్వమసి దేవేశ జ్యోతిషాంపతి రేవచ
పాపంనాశయ మేదేవ మనోవాక్కాయకర్మజమ్."

ఇట్లు నమస్కరించిన మనుజులకు ప్రభాసేశుఁడు శివలోకమొసంగును. ప్రభాసేశుని పూజించి యమప్రీతిగా నిందు బలి యొసంగవలయును.

## భరతాశ్రమము.

శ్రీరాముఁడు వనవాసమున కరుగ, దశరథము క్తికై భరతుఁడిందు పిండదానమొనర్చి, రామేశుని, సీతారామలక్ష్మణులను, ఋషివర్యులను ప్రతిష్ఠయొనర్చి యిందు నివసించినందున, శ్రీరాముఁడు సీతాలక్ష్మణసమేతముగా నిందు ప్రత్యక్షముగా వాసముసేయుచుండుకతన, భరతాశ్రమము వృక్షసముదాయముచే శోభితమై పవిత్రవంతమై పుణ్యతమమై విఖ్యా

తెనుగుచుండెను. భరతాశ్రమమం దెచ్చోటనైనను, స్నాన, తర్పణ, జప, తపో, హోమ, శ్రాద్ధ, దాన, ధర్మము లొనర్చిన నాఫలము కల్పాంతమందైనను నశింపదు. అట్లు సలిపిన మను జులు చతుర్యుగములందు చతుర్దివ్యమూర్తులై ప్రకాశించుచు పితృదేవతలకు ముక్తి నొసంగుదురు. గయాక్షేత్రమందు సలి పిన జపతపోహోమశ్రాద్ధాదికములఫల మెన్నఁడును నశింపదు. మఱియు నీయాశ్రమమందు వెలయు, ముక్తివామన, తారక బ్రహ్మలను దర్శనముసేయు పుణ్యాత్ముఁడు పితృసహితముగా ముక్తినొందును.

## మతంగాశ్రమము.

ఇది భరతాశ్రమ సమీపమందున్నది. అందు మతంగు నిచే లోక నిదర్శనమునకు స్థాపింపఁబడిన ధర్మసారమును దర్శింపవలయును. మతంగపదమందు శ్రాద్ధమొనర్చి పితరులనుఁ దరింపఁజేసి రామతీర్థమందు స్నానమొనర్చి రామేశ్వరునిఁ బూజించిన మనుజుఁడు విచారరహితుఁడై, ఆనందయుక్తుఁడై సుఖంబున మనును.

## నగపర్వతము.

ధర్మశిలజఘనప్రదేశమం దొక పర్వతము స్థాపింపఁబడి నది. తత్పర్వతము ధర్మరాజాజ్ఞచే నచ్చటినుండి కదలనందున నద్దానికి నగపర్వతమను నామము కలిగెను. అందు యమరాజు, శిల నిశ్చలమగునటుల ధర్మరాజనునామమున నిలిచెను. ఇచ్చట,

శ్లో. ధర్మరాజేన సంప్రోక్తో నగచ్ఛేతి నగః స్మృతం
యమరాజధర్మరాజౌ నిశ్చలార్థం వ్యవస్థితౌ
తాభ్యాం బలిం ప్రదాస్యామి పితౄణాం ముక్తిహేతవే

ద్వౌ శ్వానౌ శ్యామసబలౌ వైవస్వతకులోద్భవౌ
తాభ్యాం బలిం ప్రదాస్యామి స్యాతా మేతా వహింసకౌ ”

అనుమంత్రమునుఁ బఠించుచు, నగపర్వతమును స్థిరముగానుంచిన యమునకుఁ బిత్రృముక్తికొఱకును, వైవస్వత కులోద్భవములైన శ్యామ, సబలనామక శ్వానద్వయమునకుఁ బిత్రృహింసా నివారణకొఱకును బలిదాన మొసంగవలయును. ఇట్లు శ్యామసబలములకు బలియొసంగిన, పితరులు వీనివలన బాధ లేకుండ యమపురి వీడి పుణ్యలోకములను బొందుదురు.

## కుంభపర్వతము.

ధర్మశిల దక్షిణహస్తమందు కుంభపర్వతము స్థాపింపఁబడియె. అందు ఈశాన్యభాగమందు నిమిషాదిత్యనామమున మహేశ్వరుఁడుండెను. బహిర్భాగమందు వరుణద్వయము, రుద్రచతుష్టయము నిలిపియుండెను. వీరలందఱు పితరులకు మోక్షమొసంగెడు వారలు. వీరలను సభక్తికముగాఁ బూజించు మనుజుఁడు మహాపాతకోపపాతకములను వీడి పితరులతో నక్షయపుణ్యలోకమును బొందును.

## భస్మకూటపర్వతము.

తద్దక్షిణ హస్తమందు భస్మకూటమను వేఱొండు పర్వతముఁ గలదు. ఇం దీశ్వరుఁడు భస్మమును ధరించినందున దీని కీపేరు గలిగినది. ఈ పర్వతమందు భార్యాసహితులై ధర్మరాజు, అగస్త్యమహర్షియు వాసము సేయుచుండిరి. ఇచ్చట స్నానమొనర్చి అగస్త్యపదమందుఁ బిండదాన మొసంగిన మనుజునిపితరులు బ్రహ్మలోకమునుఁ బొందుదురు. అగస్త్యమహర్షి దారుణ తపమొనర్చి బ్రహ్మవలన దుర్లభవర

మాహాత్మ్యము వడసిన యీస్థలమందు స్నానసంధ్యాదికర్మములు సలిపి లోపాముద్రసందర్శనము సేసిన,అగస్త్యపత్నియు, మహాపతివ్రతయునగు లోపాముద్ర అనంతఫలము క్తముగా బ్రహ్మలోక మొసంగును. ఈపర్వతమందు జనార్దనస్వామి వాసముసేయుచుండును

భస్మకూట పర్వతమునకు దక్షిణభాగమందు కుండనాథుఁడు తపమొనర్చెను. తత్సమీపమున ప్రపితామహేశ్వరుఁడును, వటేశ్వర సహితముగా వటవృక్షమును గలవు. తదగ్రమందు రుక్మిణీకుండమును, పశ్చిమమందు కపిలానదియు, తత్తీరమునఁ గపిలేశ్వరుఁడును వాసముసేయుచుందురు. అమావాస్య సోమవాసరమునను, గ్రహణకాలములయందును కపిలానదియందు స్నానమొనర్చి కపిలేశ్వరునిఁ బూజించి సపిండశ్రాద్ధ మొనర్చిన పితరులు ముక్తినొందుదురు.

అస్తకపర్వతము.

ధర్మశిల వామహస్తమందు అస్తకపర్వతము గలదు. అందు అగ్నిధారయు, సరస్వతిచే నిర్మింపఁబడిన సారస్వతకుండమును గలవు. ఈకుండప్రాంతమున చండామార్కాది పుత్రసహితముగా దైత్యగురువు శుక్రాచార్యుఁడు వాసముచేయుచుండెను. నారదా! ఎచ్చటెచ్చట మహర్షులు పాదరూపమున వెలయుచుండిరో అచ్చటచ్చట స్నానమొనర్చి సపిండశ్రాద్ధములు సలిపిన నాయామహర్షులు, పితరులను బ్రహ్మలోకమునఁ జేర్చెదరు. మఱియు నిచ్చట పిండదాన మొనర్చిన మనుజుని పితరులు బ్రహ్మలోకగతు లగుదురు. అంతకపర్వత సమీపమందున్న నైమిశారణ్యప్రాంతమందు దేవసహితముగ బ్రహ్మ జన్మమొనర్చినందున నాస్థలములకు ముఖ్యతీర్థ మనుపేరు కలిగి

నది. ఈస్థలమున దేవతలు పదరూపములతో వాసముచేయు చుందురు. కాఁబట్టి యీస్థలమందు పదరూపములతో నొప్పు చున్న దేవతల దర్శనమును, ముఖ్యతీర్థమందు స్నానాదికము లును సలుపుమనుజుఁడు సమస్తపాపములను వీడి దేవత్వము నొందును. పవిత్రమైన నైమిశారణ్య తీర్థశ్రేష్ఠమందు వ్యాస, శుక, పౌల, కణ్వ, బ్రహ్మవిష్ణు మహేశ్వర ప్రభృతులు నివ సించియున్నందున నీతీర్థసందర్శనమువలన మనుజులు త్యక్తపా పులగుదురు.

## ఉదయాద్రి.

ధర్మశిల వామహస్తమందు ఉపవ్యస్తకము లేక ఉదయా ద్రియను నామముగల వేఱొండు పర్వతరాజము గలదు. ఈప ర్వతము అగస్త్యమహర్షి చేఁ దేఁబడి స్థాపింపఁబడినది. ఈపర్వత రాజమందు, బ్రహ్మ, మహేశ్వరుఁడు తపము సలిపినందున ముజ్జగములందునుఁ బవిత్రతరమైనదిగా ఖ్యాతిఁగాంచెను. ఇందు లోకత్రయమందు శ్రేష్ఠమగు నగస్త్యకుండమను కుండమొండుగలదు. ఇం దష్టపితృదేవతలు తపమొనర్చి శివలోకమును బొందిరి. అగస్త్యకుండసామీప్యమందు నివసించి యున్న అష్టమూర్తులకు నతు లొనర్చిన మనుజుని పితరులనుఁ దన్మూర్తులు తత్క్షణమున బ్రహ్మలోకమున కనుపుదురు.

## వాదిత్రి పర్వతము.

అగస్త్యునిచే నుదయాద్రికి వామభాగమున వేఱొండు పర్వతము స్థాపింపఁబడినది. విద్యాధరనామగంధర్వులు, అప్స రోంగనలు నందు నివసించి మనోహరమైన గీతవాద్యములచే వెలయుచుండుకతన తత్పర్వతమునకు వాదిత్రి యను నామ

యొసఁగఁబడియె. అందు గంధర్వాప్సరసల మనోహరగీతవాద్యము లిప్పటికిని వినవగు. మోహన, సునీథ, శైలూష, మోహనోత్తమ, హాహాహూహూగంధర్వ ప్రభృతులు, నారదపుష్పదంతులు వాదిత్రియందు వాసముచేయుచుండిరి. వాదిత్రిపర్వతారణ్యమందు గంధర్వరాజు చిత్రరథుఁడు గంధర్వాప్సరసలచే సేవింపఁబడి గానోత్సవముల నొప్పుచుండుకతన, తద్గానలోలత్వమున, బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో ధర్మరాజాది దేవవర్యులు లవస్థితులై యొప్పుచుండిరి. గయాక్షేత్రమందు నివసించి పితరులకు మోక్షమొసంగు దేవవర్యుల నీ పర్వతరాజమునఁ జూడనగు. ఇందు ధర్మరాజును పార్వతీసహితుఁడై మహేశ్వరుఁడును యజ్ఞాదికము లొనర్చిరి. సానందుఁడై పార్వతీసహితుఁడై వాదిత్రిపర్వతమున వాసముసేయు పశుపతిని సభక్తికముగా పూజలొనర్చిన మనుజుఁడు పితృసహితముగా సద్గతినొందును నారదా! ఇందు మహేశ్వరుని పూజించుమనుజుని జేరనేరక వైష్ణవమాయ వ్యర్థమయ్యెను.

## గృధ్రకూటపర్వతము.

ధర్మశిలవామహస్తమందు గృధ్రకూటపర్వత మను వేఱొండు పర్వతము గలదు. అందు మహర్షులు గృధ్రరూపములుఁ దాల్చి తపమొనర్చి సిద్ధినొందిరి. అందువలన నీ పర్వతమునకు గృధ్రకూటమను నామము గలిగినది. ఇందు గృధ్రవటమును, గృధ్రేశ్వరుఁడునుఁ గలరు. గృధ్రేశ్వరుని దర్శనమువలన శివలోకము చేకూరును. గృధ్రవటచ్ఛాయయందు పిండదాన మొనర్చిన మనుజులు పితృసహితముగా శివలోకమును బొందుదురు. గృధ్రవటదర్శన మొనర్చి నతులొనర్చిన మను

జుఁడు ఋణవిముక్తుఁడై పాపరహితుఁడై పితృవర్గముతో శివలోకమునుబొందును. అచ్చటమూలక్షేత్ర మనుక్షేత్ర మొండుగ గలదు. తత్ క్షేత్రమున జనులు పిండదాన మొనర్చిన, పితరులకు స్వర్గప్రాప్తియగును.

—ఆదిపాల పర్వతము.—

ధర్మశిలయుదరభాగమున ఆదిపాలనామకపర్వత మొండుగలదు. అందు గజరూపముతో విఘ్ననాశకుఁడు విఘ్నేశ్వరుఁడు వాసమొనర్చుచుండెను. అందలి విఘ్నవినాయకునిదర్శించిన మనుజులకు వినాయకుఁడు విఘ్నరహితకార్యసిద్ధి యొనఁగూర్చి పితరులకు బ్రహ్మలోక మొనగూర్చును.

గయాసురుని నాభిప్రదేశమున సుషుమ్నానాడియందు పిండదాన మొనర్చిన పితరులు స్వర్గమునుఁ బొందుదురు.

గయాసురుని ముండపృష్ఠభాగమున మహాదేవి నివసించియుండెను. తద్దేవి దర్శనమువలన మహాపాత కోపపాతకములు నశించును. ప్రేతాదికములు లేనందున గయాక్షేత్రమతి పవిత్రమై శ్రేష్ఠమై యొప్పుచున్నది. మగధ (కీకట) దేశమందు గయాక్షేత్రము, రాజగృహవనము, చ్యవనకాశ్రమము పునః పునానది యీనాలుగును పవిత్రవంతములు. వైకుంఠ (ఆదిగదాధరపదము) లోహదండ, గృధ్రకూట శౌనకాశ్రమముల యందు శ్రాద్ధాదికము లొనర్చినమనుజులు తమపితృదేవతలను దరింపఁజేయుదురు. ముండపృష్ఠపర్వతమున నొకానొక మహర్షి క్రౌంచపక్షిరూపముతో తప మొనర్చెను. ఆముని క్రౌంచపాదచిహ్నములు అందు వెలయుచుండుకతన నాస్థానము క్రౌంచపాదమను నామమున నొప్పుచున్నయది. అచ్చటి జలాశయ

మందుస్నానమొనర్చిన పితరులు స్వర్గమునుఁబొందుదురు. దీని చెంత కాకశిలపర్వతము గలదు. అందు బలియొసంగిన, పితృదేవతలు కాకరూపము వీడి ముక్తినడయుదురు. లోమశ లోమహార్షణులు ముండపృష్ఠపర్వతమందుఁ దపమొనర్చి సిద్ధినొందిరి. లోమశమహర్షి, సరస్వతీ, వేత్రవతీ, చంద్రభాగా, గోమతీ, కావేరీ, సింధువీరా, చందనా, వాశిష్ఠీ, సరయూ, గంగా, యమునా, గండకీ, మహానదీ, వైతరణీ, నిఝీరా, దేవసరయూ, అలకనందా, ఉదీచీ, కనకా, కౌశికా, బ్రహ్మదా, పాపఘ్నీ, జ్యేష్ఠా, కృష్ణా, చర్మణ్వతీ, నర్మదాదిమహానదులను తన తపోబలముచే నావాహన మొనర్చెను. ముక్తినొసంగు నీనదుల యందు స్నానమొనర్చి సపిండశ్రాద్ధములు సలిపిన పితరులు బ్రహ్మాదిలోకములనుండి వెలువడి గర్భనరకరహితులై శాశ్వత స్వర్గనివాసము నడయుదురు. పుష్కరసమయందు నిఝీరనది యందు స్నానమొనర్చి పిండదానముసేసి క్రౌంచపదమందు మూఁడురాత్రులు నివసించిన, పితరులు మహాపాతకములనైన వీడి స్వర్గపురమును బొందుదురు.

భస్మకూటపర్వతమున నెలకొనియున్న జనార్దనస్వామి హస్తమందు తిలవిహీనముగా సవ్యముగా (ఉపవీతి) నాత్మ పిండము నిడుచు,

"శ్లో. యా ముద్దిశ్య త్వయా దేవ దేహిపిండం మృతేప్రభో<br>
ఏషపిండో మయాదత్త స్తవహస్తే జనార్దన<br>
అంతకాలే గతే మహ్యం త్వంతు దాతా భవిష్యసి<br>
జనార్దననమస్తుభ్యం నమస్తే పితృమోక్షద"

జనార్దనా! ఇప్పుడు నేను నీహస్తమందిడుచున్న పిండ

మును నాఅంతమందు మోక్షమొసగూడుటకు, నాకు దయ చేయవలయును మఱియు స్వామీ! నాపితరులకు మోక్షమును దయచేయుమని నమస్కరించుచున్నాను. అని ప్రార్థింపవల యును. జీవవంతులగు పితరులను గూర్చి దధియుక్తపిండమును జనార్దనుని హస్తమందిడుచు,

"శ్లో. జీవతాం దధిసమ్మిశ్రం సర్వేయే విష్ణులోకగాః
యస్తు పిండోమయాదత్త స్తవహస్తే జనార్దన
య ముద్దిశ్య త్వయా దేవ దేహిపిండం మృతేప్రభో
అంతకాలే గతే యూయం త్వంతు దాతా భవిష్యసి."

అని పఠించుచు నెవరిని నుద్దేశించి యీపిండమును నీ హస్తమం దిడుచుంటినో వారికి, జనార్దనా! అంతమందు మోక్ష మును దయచేయవలయును. అని ప్రార్థించవలయును. పిమ్మట, పితృమాతృస్వరూపుఁడవగు స్వామీ! నీకునమస్కారము. గ యాక్షేత్రమందు స్వయముగా పితృరూపముతో ప్రకాశించు చున్న పుండరీకాక్షా! నన్ను ఋణత్రయములనుండివి మోచనము చేయవలసినది. అందుకుగాను నమస్కరించుచున్నాను. నాపిత రులకు మోక్షమొసంగవలయునని స్వామీ నమస్కరించుచు న్నాను. నాపితరులు విష్ణులోకమందు సుఖమనుభవించుటకు, లక్ష్మీకాంతా! సపిండశ్రాద్ధములు సలుపుచుంటిని. కాఁబట్టి నాపితరులను నూఱుకులములవారినిఁ దరింపఁజేయుమని ధర్మా త్మా! నిన్నుఁ బ్రార్థించుచున్నాను.

"శ్లో. పితృమాత నమస్తేస్తు నమస్తే పితృరూపిణే
గయాయాం పితృరూపేణ స్వయమేవ జనార్దన
తం ధ్యాత్వా పుండరీకాక్షం ముచ్యతేచ ఋణత్రయాత్
నమస్తే పుండరీకాక్ష ఋణత్రయవిమోచన

లక్ష్మీకాంతనమ స్తేస్తు పితౄణాం మోక్షదో భవ
వామజానుంచ సంపాత్య నత్వా భీమం జనార్దనం
శ్రాద్ధం సపిండకం కృత్వా పితృభి ర్విష్ణులోకభాక్
పితృభి స్సహ ధర్మాత్మా కులానాంచ శతేనచ."

అని యివ్విధంబున భస్మకూటజనార్దనస్వామినిఁ బ్రార్థించవలెను.

ఇది చతుర్థాధ్యాయము.

---

# పంచమాధ్యాయము.

దేవర్షియగు నారదుండు పవిత్ర ధర్మశిలామాహాత్మ్యము నాలకించి, మహాత్మా! సత్కుమారా! ఆదిగదాధరుండగు వాసుదేవుండు, ఎవ్విధంబున గయాక్షేత్రమందు వ్యక్తావ్యక్తరూపముల స్థితుండై యుండెను? ఎవ్విధంబున వ్యక్తావ్యక్తరూపముల నివాసముచేయుచుండెను? విష్ణుభగవానుఁడు ఏగదను తనహస్తమందు ధరియించి ఆదిగదాధరనామమునఁ బ్రఖ్యాతుఁడయ్యెనో, ఆగద యేప్రకార ముత్పన్నమైనది? సమస్తపాపములను నాశముచేయుగదాతీర్థమెట్లుత్పన్న మయ్యెను? ఈవృత్తాంతమును సమగ్రముగా సెలవొసంగినన్ను ధన్యునిఁ జేయుఁడని సనత్కుమారుని వినయపూర్వకముగా ప్రార్థింప, సనత్కుమారుండు సాదరచిత్తుండై యిట్లు చెప్పందొడంగె:—

వజ్రమునకన్న నతి కఠినశరీరముగల గదానామక రాక్షసుఁ డొకఁడుగలఁడు. గదాసురుఁడు తనశరీరములోని దృఢతరాస్థులను బ్రహ్మకు తత్ప్రార్థనానుసరణముగ నొసంగెను. ఆయెమ్ములను బ్రహ్మ విశ్వకర్మకొసఁగ, నాయెమ్ములతో విశ్వకర్మ విచిత్రతరముగ గదను నిర్మించి, పితామహుని కొసంగ, దానిని స్వర్గమందుంచెను. ఈసమయమందు బ్రహ్మపుత్త్రుఁడగు హేతియనురాక్షసుఁడు నూఱువేల దివ్యవర్షములు, ఊర్ధ్వముఖుఁడై, ఊర్ధ్వబాహుఁడై పాదాంగుష్ఠమందు నిలిచి, వాయు, పర్ణభక్షణములు సేయుచు దారుణతప మొనర్చుచుండ, తత్తపంబునకు బ్రహ్మాదిదేవతలు సంతసించి ప్రసన్నులై హేతిని జేరి,

దానవోత్తమా! నీతపంబునకు మెచ్చితిమి. నీకోరినవరంబుల నొసంగ సిద్ధంబుగ నుంటిమి. కోరుమన, నేను దేవ, దానవ, మానవులచే, విష్ణుమహేశ్వరులచే నానావిధాస్త్రశస్త్రములచే, చక్ర, శూల, వజ్రాద్యాయుధములచే నవధ్యుఁడనై మహాబలవంతుఁడనై యొప్పుచుండునటుల వరమొసంగుఁడని హేతిప్రార్థింప నొసంగితి మని చెప్పుచు బ్రహ్మాదిదేవతలు అంతర్ధాన మొందిరి. పిమ్మట హేతి వరగర్వముచేఁ గన్నుఁగానక, ఇంద్రాదిబృందారకులను జయించి పాఱఁద్రోలి స్వర్గపురాధిపత్యము వహించెను. అంతట నింద్రాదులు భయభ్రాంతులై, విష్ణుని ప్రాపుచేరి, మహాత్మా! త్రివిక్రమా! హేతిబాధకు తాళఁజాలకున్నారము. వానిని వధించి మమ్ము రక్షింపుమనిప్రార్థించిరి. అంతట, విష్ణువు, హేతి దేవదానవమానవులచేఁ జచ్చువాఁడుగాఁడు. వానిని వధించుటకు నెద్దియేని నాయుధమును నాకొసంగుఁడు. దానిని సాధనముగాఁ జేసికొని వానిని వధించెదనని దేవతలతోఁ బల్కెను. విష్ణువాక్యముల నాలకించి, మున్ను గదాసురుని యెముకలతో విశ్వకర్మచే నిర్మింపఁబడి స్వర్గపురమందు నెలకొల్పఁబడియున్న గదాయుధమును ఇంద్రాదులు విష్ణుని కొసంగి, దీనితో హేతిని వధింపు మని వేఁడుకొనిరి. గదాయుధమును ధరించిన విష్ణుభగవానునిజూచి దేవతలు ఆదిగదాధరుఁడవని పలికిరి. అది కారణమునను, గయాసురు శిరమునం దుంచఁబడిన శిల కదలకుండ స్థిరముగా నుండునటుల తచ్ఛిలపై గదాయుధమును ధరించి మునుముందు నిలిచినకతంబునను, నారాయణుఁడు, ఆదిగదాధరుఁడని పిలువఁబడుచుండెను. నారాయణుఁడు గదాయుధముతో హేతినివధించి స్వర్గపురమును దేవతల కొసంగెను. హేతివధానంతర మేస్థలమందు గదాయుధ

మును ప్రక్షాళన మొనర్చెనో, యాస్థలము గదాలోల తీర్థ
మను పేరం బరఁగుచు నతిపవిత్రమై యొప్పుచున్నది. గయాసు
రుని శిరమునందుంచఁబడిన శిలకదలకుండ నుండునటుల మును
ముందు ఆదిగదాధరుఁడు తచ్ఛిలయందు నిలిచెను మఱియు,
ముండపృష్ఠ, ప్రభాస, నగోద్యంతక, వాదిత్రి, భస్మకూట,
గృధ్రకూట, ప్రేతకూ, టాదిపా, లారవిందక, క్రౌంచపా,
దాక్షయవట, ఫల్గుతీర్థ, మధుశ్రవా, ఘృతకుల్యా, మధుకుల్యా,
మహానదీ, దేవికా, వైతరణీప్రభృతిరూపమున నాదిగదాధ
రుఁడు ప్రకటరూపమున స్థితుఁడై యుండెను. ఉత్తమమైన విష్ణు
పద, శివపద, బ్రహ్మాపద, కశ్యపపదములందు మనుజులు శ్రాద్ధమొ
నర్చిన, తత్పితరులు ప్రత్యక్షముగా తమచేతులతో పిండములు
గ్రహించెదరు. పంచాగ్నీంద్రాగస్త్య, సూర్య, స్వామి కార్తీక,
క్రౌంచ, మాతంగ, దధీచి, చంద్రమో, గణేశ, కణ్వాద్యుత్త
మపదములు గలవు. ఇందు ముఖ్యలింగములు, మూర్తిపాద
రూపములతో వ్యక్తావ్యక్తముగ వాసము సేయును. చక్రరూ
పమున నాదిగదాధరుఁడు లక్ష్మీసహితుఁడై యొప్పుచుండును.
గాయత్రి, సావిత్రి, సరస్వతి, గయాదిత్యోత్తరార్క, దక్షి
ణార్క, నైమిశక్షేత్ర, శ్వేతార్క, గణనాథాష్టవసు, సర్వము
నీశ్వరులు, ఏకాదశరుద్ర, సప్తర్షి, సోమనాథ, సిద్ధేశ, కపర్దీశ,
వినాయక, నారాయణ, మహాలక్ష్మి, బ్రహ్మా, పురుషోత్తమ, మా
ర్కండేయ, కోటీశాంగిరః పితామహ, జనార్దన, మంగళదేవి,
పుండరీకాక్షేత్యాది వ్యక్తరూపములతో నాదిగదాధరుఁడు ధ
ర్మశిలయందువాసము సేయుచుండును. బ్రహ్మారుద్రాదులతో ధ
ర్మశిలయందు నిలిచి గయాసురుని నిశ్చలత్వ మొనర్చిన యాది

గదాధరుని దేవతలీవిధంబున స్తోత్రముచేసిరి. దేవా! నీ వాదిమధ్యాంత రహితుండవు, అచ్యుతుండవు, అవికారుండవు, అమరుండవు, ఆద్యుండవు, అణిమా ద్యష్టసిద్ధివిరాజమాన మానసీయుండవు, అనాది పురుషుండవు, అవాఙ్మానసగోచరుండవు, అప్రమేయుండవు, అప్రతిముండవు, అజ్ఞేయుండవు, ఆదిగదాధరుండవు, ఈశ్వరుండవు, ఉత్కృష్టుండవు, ఐశ్వర్యవంతుఁడవు, కోలాహలసుందరకందరవిహారుండవు, కలియుగశోభితుండవు, కలికల్మషనాశకుండవు, గయాక్షేత్రవాసుండవు, గదాయుధ శోభితుండవు, పాపరహితుండవు, పవిత్రుండవు, బ్రహ్మేంద్రాది బృందారక పూజితాంఘ్రిద్వయుండవు, భవశ్రీయుండవు, సత్వరజస్తమోగుణవిహీనుండవు, సర్వభూతహృదంతరస్థితుండవు, సర్వదేవతాశోభితుండవు, శబ్దస్వరూపుండవు, సర్వజ్ఞుండవు, చిత్స్వరూపుండవు, చిరముక్తుండవు, జితేంద్రియుండవు, శ్రుతిగేయుండవు, సూర్యమండల మధ్యవర్తివి, శ్రేష్ఠుండవు, దివ్యగుణభూషితుండవు, దైత్యకాలుండవు, దేవాది దేవుండవు, వజ్రశరీరుండవు, విరూపుండవు, వీతరాగుండవు, మాయాతీతుండవు, జ్ఞానస్వరూపుండవు, యోగిధ్యేయుండవు, యోగజ్ఞుండవు, నిర్జరుండవు, వేదవేద్యుండవు, నిష్కాముండవు, ఇట్టి నిన్ను మాపుణ్యవశంబున గయాక్షేత్రమందు కనుఁగొనఁగలిగితిమి. మమ్మురక్షింపుము. మాయందుఁ బ్రసన్నుండవగుము. మాకోర్కెలొనగూర్పుము. నీకునమస్కారంబు. నీకునంజలి. నీకువందనము. నీకుం బ్రణుతియని బహువిధంబులఁ బ్రార్థించు దేవవర్యుల నీక్షించి మీభక్తికి మెచ్చితి. మీవలయుదానినిఁ

గోరుడు. ఒసంగెదనని ఆదిగదాధరుండు పలుక, మహాత్మా! దేవరూపిణిశిలయందు నీవు తక్క మేమెవ్వరమును వాసము సేయుటకు శక్తిగలవారముగాము. కాని నీతో వ్యక్తాదిరూపముల నివసించుచుందుము. అని బ్రహ్మాది దేవతలు పలుక, మంచిదని, లోకసంరక్షణార్థమై, పితరులకు ముక్తినొసంగుటకై ధర్మశిల యందు మహాలక్ష్మీసమేతుఁడై వాస మొనర్చు చుండెను. ఈమూర్తిని దేవతలుకూడ ధ్యానమొనర్చుట కశక్తులు. ఎన్నఁడును నాశముగాని ప్రకటస్వరూపమునుదాల్చి శ్రీమహా విష్ణువు పుండరీకాక్ష, జనార్దనాది నామములచే విఖ్యాతి నొందుచుండెను. వరాహకల్పమునందు పుండరీకాక్ష,జనార్దన నామములతో నొప్పునన్ను (ఆదిగదాధరుని) సభక్తికము గా ధ్యానమొనర్చినవారికి శ్వేతకల్పమందు ప్రత్యక్షమయ్యె దనని భగవంతుఁడు దేవతలతోఁ బల్కెను. నారదా! మాన వుల నుద్ధరించుటకును, దివ్యులను రక్షించుటకును గయా సురుని శిరమునం దవస్థితుఁడై యొప్పుచున్న యాదిగదాధరుని నిత్యము భక్తియుక్తముగా దర్శనపూజనము లొనర్చువారు కుష్ఠాదిరోగరహితులై యక్రమముగా విష్ణులోకమును బొందు దురు. ఆదిగదాధరుని శ్రద్ధాభక్తులతో వందనార్చనములు స లుపువారలు ధనధాన్యాయురారోగ్యైశ్వర్యములతో, పుత్ర పౌత్రులతో, యశ, స్సుఖ, రాజ్య, భోగభాగ్యంబులతోఁ దుల దూఁగుదురు. అంతమందుఁ దత్ఫలమువలన బ్రహ్మాలోకమునుఁ బొందుదురు. గయాక్షేత్రమం దాదిగదాధరప్రీతిగా గంధమొ సంగిన మనుజుఁడు గంధయుక్తతనుధారియై యొప్పుచుండును.

ధూపదానమువలన రాజ్యప్రాప్తియు, దీపదానమువలన తేజశ్శ
రీరమును, ధ్వజదానమువలన పాపనాశనమును లభించును. అం
దుశ్రాద్ధాదికము లొనర్చిన పితరులకు విష్ణులోకప్రాప్తియు,సమం
త్రకముగా భక్తిశ్రద్ధలతో నాదిగదాధరునిఁ బూజించిన పితృ
సహితముగా వైకుంఠవాసమునుఁ గలుగును. ముండపృష్ఠప
ర్వతమున ఫల్గుతీర్థాదిరూపములతో నప్రకటముగా నివసించు
నాదిగదాధరునకు నమస్కారము. ముండపృష్ఠపర్వతమునస్వయ
ముగా జనార్దననామముతో ప్రకాశించు నాదిగధారునకు నమ
స్కారము. దేవరూపిణియందు నివసించి బ్రహ్మాదిదేవతలచే
పూజింపఁబడి స్తుతింపఁబడు నాదిగదాధరునకు నమస్కారము.
బ్రహ్మాండమునకు కారణభూతుఁడై, జ్ఞానస్వరూపుఁడై వెలు
గొందు నాదిగదాధరునకు నమస్కారము. శ్రాద్ధాది కర్మము
లచే, దర్శనస్పర్శన పూజనప్రణామములచే బ్రహ్మలోకమొసం
గు నాదిగదాధరునకు నమస్కారము. శరీరేంద్రియ,మనోబుద్ధి,
ప్రాణా, హంకార జాగ్రత్స్వప్న సుషుప్త్యాది రహితుఁడగు నా
దిగదాధరునకు నమస్కారము. పద, ముఖ, లింగ రూపములతో
వ్యక్తావ్యక్తముగ గయాక్షేత్రమందు నివసించియున్న యాది
గదాధరునకు నమస్కారము. నిత్యానిత్య శూన్యుండును, ఆ
నందస్వరూపుండును, అవినాశుండును, జ్యోతిస్స్వరూపుండును
నగు నాదిగదాధరునకు నమస్కారము. అని యివ్విధంబున మ
హేశ్వరుం డాదిగదాధరుని స్తోత్రమొనర్చి తత్సమీపమున బ్ర
హ్మాది దేవతాసహితముగా ధర్మశిలపై నిలిచెను. ముండపృష్ఠప
ర్వతమందు నివసించియున్న యాదిగదాధరుని స్తుతియొనర్చి

పూజించు మానవులు విష్ణులోకమున కరుగుదురు ధర్మార్థులు ధర్మమును, ధనార్థులు ధనమును, కామ్యార్థులు కామ్యమును, మోక్షార్థులు మోక్షమునుఁ బడయుదురు. వంధ్యస్త్రీకి సంతానప్రాప్తి కలుగును. భూపతికి విజయమును, శూద్రునకు సుఖమును చేకూరును. పుత్రకాములు వేదవేదాంగపారగుండగు పుత్రునిఁ బడయుదురు. ఆదిగదాధరునిఁ బూజించుమనుజులు సర్వమనోరథసిద్ధులై సుఖంబున మనుదురు.

## పంచమాధ్యాయము.

# షష్ఠాధ్యాయము.

---

నారదా! మున్ను బ్రహ్మచెప్పిన ముక్తికారకమగు గయాయాత్రావిధానంబు తెలియంగఱింగించెద. వినుము:—

గయాయాత్ర చేయు మనుజుఁడు, మునుముందు నిజగ్రామమందు విధిపూర్వకముగ శ్రాద్ధమొనర్చి, కాషాయాంబరములు ధరించి, గ్రామప్రదక్షిణమొనర్చి, గ్రామబహిర్భాగమున శ్రాద్ధశేషాన్నమును భుజించి బయలు దేరవలయును. ఈవిధమున బయలుదేరి మార్గమధ్యమున దానప్రతిగ్రహావర్జితుఁడై యాత్ర చేయవలయును. దానప్రతిగ్రహ వివర్జితుఁడై, అహంకారనివృత్తుఁడై, సంతోష, నియమ, శుచిత్వములు గలిగి గయాయాత్ర యొనర్చువానికి ఫలము చేకూరును. ఇంద్రియవశుఁడై, జితేంద్రియుఁడై, దానశీలుఁడై యాత్రసలుపుమనుజుఁడు యాత్రఫలమును బొందును. ఇవ్విధంబున గయాక్షేత్రమున కరుగుమనుష్యుఁడు తనగృహమును విడిచి ఎన్ని పదములిడునో, వానిపితరులు అన్నిస్వర్గసోపానముల నెక్కుదురు. ఇట్టినియమములతో గయాక్షేత్రమున కేగుమనుజునకు నిశ్చయముగా నశ్వమేధఫలము లభించును. నారదా! యీ విధంబున గయాక్షేత్రమున కేగిన మనుజుఁడు బ్రహ్మచర్యాశ్రమ నియమమునుబూని, వశీకృతచిత్తుఁడై యుండవలయును. గయాక్షేత్రమును ప్రవేశించుటకుపూర్వము మహానదియందు స్నానతర్పణము లొనర్చి స్వవేదశాఖానుసరణిని విధ్యుక్తముగా, అర్ఘ్యావాహాన రహితముగా శ్రాద్ధ మొనర్పవలయును. మఱుసటి దివ

సమున శుచిత్వము వహించి ప్రేతపర్వతమున కరిగి బ్రహ్మకుండ మునస్నానతర్పణములు సలిపి, దక్షిణాభిముఖుఁడై, ప్రాచీనావీతుఁడై శ్రాద్ధమును సలుపవలయును. కవ్యవాహానల,చంద్ర, యమార్యమాగ్నిష్వాత్త, బర్హిషద, సోమపాది పితృదేవతల నిందువయ చేసి, పితృబంధుప్రీతిగా సపిండశ్రాద్ధమొనర్చుటకు గయాక్షేత్రమున కరుదెంచితిని. కాఁబట్టి నేనొనర్చుశ్రాద్ధమును సపిండకముగా సంరక్షించి నాపితరులకు నిరంతరము తృప్తినొసంగి తత్పిండములు వారికి అక్షయ్యమగునట్లు లొనర్పుఁడని ప్రార్థించవలయును. పితరులకు పునరావృత్తి శాశ్వత బ్రహ్మలోకప్రాప్తికొఱకు, ఆచమన మొనర్చి, అంగన్యాసాది పంచాంగసహిత ప్రాణాయామపూర్వకముగ సంకల్పమొనర్చి విధ్యుక్తముగా నావాహనము పూజనములు జరపి, చరు, ఘృత, పంచగవ్యములతో ప్రేతశిలకు సమంత్రకముగా నభిషేచన మొనర్చి శ్రాద్ధమొనర్పవలయును. ఈవిధంబుననే పదములను, పద దేవతలను పూజింపవలయును. పితృకర్మములందు నెన్నితిలలు వాడఁబడునో, అందఱు రాక్షసులు సింహామునుజూచి మృగములు పాఱునటుల, భయభ్రాంతులై పాఱిపోవుదురు. అష్టక, వృద్ధి (నాందిముఖము) గయా, మృతతిథిప్రయుక్త శ్రాద్ధములందు మాతృశ్రాద్ధమును ప్రత్యేకముగాఁ జేయవలయును. వృద్ధిశ్రాద్ధమందు, మాతృపూర్వకముగను గయాశ్రాద్ధమందు పితృపూర్వకముగను జరపవలయును.

దక్షిణాగ్రముగ కుశనుపఱచి పాదారంభముగ గృహ్యోక్తప్రకారముగ, దధి, మధు, ఘృత తిలసహితసక్తుపిష్ట ముష్టిప్రమాణ పిండములను దానమొనర్చిన తత్పిండము లక్షయ్యము లగును. సంబంధులను తిలోదకముతో కుశోపరిభాగ

ముః నావాహనము సేయవలయును. ఆబ్రహ్మాస్తంభపర్యంతముగల సమస్తప్రాణులు, దేవర్షి, పితరులు నేనొసంగు తిలజలములతో తృప్తినొందవలయును. మఱియు, మాతా మాతామహాది సమస్తపితరులు, సప్తద్వీపములయందు నివసించు ప్రాణులును నేనొనర్చు పిండదానమువలన నిరంతరతృప్తినొందవలయును.

శ్లో. ఆబ్రహ్మభువనా ల్లోకా దిదమస్తు తిలోదకమ్
పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః.
మాతాపితామహీచైవ తథైవ ప్రపితామహీ
మాతామహ స్తత్పితాచ ప్రమాతా మహాకాదయః.
తేషాంపిండో మయాదత్తో హ్యక్షయ్య ముపతిష్ఠతు
ముష్టిమాత్రప్రమాణంచ ఆర్ద్రామలకమాత్రకమ్.
శమీపత్రప్రమాణేన పిండందద్యా ద్గయాశిరే
ఉద్ధరే త్సప్తగోత్రాణాం కుల మేకోత్తరం శతమ్.

బ్రహ్మమొదలు భూలోకపర్యంతము గల సమస్తప్రాణుల తృప్తికొఱకు తిలోదకముల నొసంగుచుంటిని. పితృవర్గ, మాతృవర్గ, మాతామహవర్గత్రయములనుగూర్చి నే నొసంగు పిండము లక్షయ్యమగుఁగాక. ముష్టిమాత్రము ఉసిరికాయ లేక శమీపత్రప్రమాణముగల పిండములను గయాసురుని శిరమునందిడిన సప్తగోత్రములును, నూటయొక్క కులములును తరించును.

## సప్తగోత్రముల, నూటయొక్క కులముల వివరము.

శ్లో. పితృమాతృశ్చ భార్యాయా భగిన్యా దుహితు స్తథా
పితృష్వసు ర్మాతృష్వసుః సప్తగోత్రాః ప్రకీర్తితాః.

తండ్రి, తల్లి, భార్య, తోఁబుట్టువు, కూఁతురు, మేనత్త పినతల్లి పెదతల్లులు, వీరివి సప్తగోత్రములు.

శ్లో. చతుర్వింశచ్చ వింశచ్చ షోడశద్వాదశైవహి
రుద్రాదశవసుశ్చైవ కులాన్యేకోత్తరంశతం.

పితృవంశమున 24, మాతృవంశమున 20, భార్యవంశమున 16, తోఁబుట్టువువంశమున 12, కూఁతువంశమున 11, మేనత్తవంశమున 10, పినతల్లి పెదతల్లులవంశమున 8 కులములు. ఇవి నూటొక్కకులములు.

శ్లో. అస్మత్కులమృతాయేచ గతిర్యేషాంనవిద్యతే
ఆవాహయిష్యే తాన్సర్వా న్కుశపృష్ఠే తిలోదకైః

నాకులములో మృతినొంది గతిలేనివార లెవరుగలరో, వారినందఱిని ఈ కుశోపరిభాగమున తిలోదకముల నావాహనము సేయుచున్నాను.

శ్లో. మాతామహకులేయేచ గతిర్యేషాం నవిద్యతే
ఆవాహయిష్యే తాన్సర్వా న్కుశపృష్ఠే తిలోదకైః.

మాతామహకులములో మృతినొంది గతిలేనివార లెవరుగలరో వారినందఱిని ఈకుశోపరిభాగమున తిలోదకముల నావాహనము సేయుచున్నాను.

శ్లో. బంధువర్గకులేయేచ గతిర్యేషాం నవిద్యతే
ఆవాహయిష్యే తాన్సర్వా న్కుశపృష్ఠే తిలోదకైః.

బంధుకులమందు మృతినొంది గతిలేనివార లెవరుగలరో వారినందఱి నీకుశోపరిభాగమున తిలోదకముల నావాహనము సేయుచున్నాను.

ఈవిధముగా కుశోపరిభాగమున సమంత్రకముగా పితృ
ులను నావాహనమొనర్చి యథాక్రమముగా పిండదానమొన
ర్పవలయును.

శ్లో॥ అస్మత్కులే మృతా యేచ గతి ర్యేషాం నవిద్యతే
తేషా ముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం.

నాకులమందు మృతినొంది గతిలేనివార లెవరుగలరో
వారియుద్ధరణార్థమై యీపిండము నొసంగుచున్నాను.

శ్లో. మాతామహకులేయేచ గతిర్యేషాం నవిద్యతే
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహం.

మాతామహకులమందు మృతినొంది గతిలేనివార లెవ
రుగలరో వారియుద్ధరణార్థ మీపిండము నొసంగుచున్నాను.

శ్లో. బంధువర్గకులేయేచ గతిర్యేషాం నవిద్యతే
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహం.

బంధువర్గకులమందు మృతినొంది గతిలేనివార లెవరుగ
లరో వారియుద్ధరణార్థమున కీపిండము నొసంగుచున్నాను.

శ్లో. అజాతదంతా యేకేచి ద్యేచగర్భే ప్రపీడితాః
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహం.

నాకులమందు దంతములు పొడసూపని పసితనమం
దును, గర్భమందును గతించినవార లెవరుగలరో వారియుద్ధర
ణార్థమున కీపిండము నొసంగుచున్నాను.

శ్లో. అగ్నిదగ్ధాశ్చ యేకేచి న్నాగ్నిదగ్ధా స్తథాపరే
విద్యు చ్చోరహతాయేచ తేభ్యఃపిండం దదామ్యహం.

అగ్నివలన మృతినొందినవారికిని, అగ్నిసంస్కారమున
కర్హంతరానివయసున మృతినొందినవారికిని, ఉఱుము మెఱపుల

వలన మృతినొందినవారికిని, సుగతిప్రాప్తికీపిండము నొసంగు చున్నాను.

శ్లో. దావదాహేమృతాయేచ సింహవ్యాఘ్రహతాశ్చయే
దంష్ట్రిభిశ్శృంగిభిర్వాపి తేభ్యఃపిండం దదామ్యహమ్.

దావానలమువలనను, సింహవ్యాఘ్రాదులవలనను, దంతములు, శృంగములుగల జీవజంతువులవలనను మృతినొందినవారి సద్గతికొఱకు ఈపిండము నొసంగుచున్నాను.

శ్లో. ఉద్బంధనమృతాయేచ విషశస్త్రహతాశ్చయే
ఆత్మనోఘాతినోయేచ తేభ్యఃపిండం దదామ్యహమ్.

పాశబంధనము వలనను (ఉరి), విషమువలనను, శస్త్రాద్యాయుధములవలనను, మృతినొందిన వారికిని, ఆత్మహత్య యొనర్చుకొనినవారికిని సద్గతి చేకూరునటుల ఈపిండము నొసంగుచున్నాను.

శ్లో. అరణ్యేవర్త్మనిరణే క్షుధయా తృషయాహతాః
భూతప్రేతపిశాచాశ్చ తేభ్యఃపిండం దదామ్యహమ్.

అరణ్యమందును, మార్గమందును, యుద్ధమందును మృతినొందినవారికిని, ఆఁకలిదప్పులవలన మృతినొందినవారికిని, భూతప్రేతపిశాచయోనులయందుండు వారికిని సద్గతిచేకూరునటుల ఈపిండము నొసంగుచున్నాను.

శ్లో. రౌరవే చాంధతామిస్రే కాలసూత్రే చయేగతాః
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహమ్.

రౌరవ, చాంధతామిస్ర, కాలసూత్రాది నరకకూపములయందుఁ బడి బాధనొందువారల తరణోపాయమునకు ఈపిండము నొసంగుచున్నాను.

శ్లో. అసిపత్రవనేఘోరే కుంభీపాకేచయోగతేః
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహమ్.

అసిపత్రవనము, కుంభీపాకము మొదలగు నరకముల బాధపడువారి తరణోపాయమున కీపిండము నొసంగుచున్నాను.

శ్లో. అనేకయాతనాసంస్థాః ప్రేతలోకంచయేగతాః
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహమ్.

నానావిధదుఃఖముల ననుభవించుచు ప్రేతయోనులయందు వాసముసేయువారికి మోక్షప్రాప్తి యగునటుల నీపిండము నొసంగుచున్నాను.

శ్లో. అసంఖ్యయాతనాసంస్థా యేనీతా యమశాసనైః
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహమ్.

యమపురమందు అసంఖ్యాకములైన బాధల నొందుచున్నవారికి సద్గతి కలుగుటకు నీపిండము నొసంగుచున్నాను.

శ్లో. నరకేషు సమస్తేషు యాతనాయాంచ సంస్థితాః
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహమ్.

సమస్తనరకములయందు ననేక కష్టముల నొందుచున్నవారిని తరింపఁ జేయుటకు ఈపిండము నొసంగుచున్నాను.

శ్లో. పశుయోనిగతాయేచ పక్షికీటసరీసృపాః
అథవావృక్షయోనిస్థా స్తేభ్యః పిండం దదామ్యహమ్.

పశు, పక్షి, కీట సర్పాది నీచయోనులయందును లేక వృక్షయోనులయందును తగులుకొని యుండిరో వారిని తరింపఁజేయుటకు నీపిండము నొసంగుచున్నాను.

శ్లో. జాత్యంతరసహస్రేషు భ్రమంతః స్వేనకర్మణా
మానుష్యం దుర్లభంయేషాం తేభ్యఃపిండం దదామ్యహమ్.

నాపితరులు వారివారి కర్మానుగుణముగ అనేకవిధముల జాతి సహస్రయోనుల భ్రమణమొందుచు మనుష్యయోని గతులగుటకు నశక్తులై యుండిరో వారికొఱకు నీపిండము నొసంగుచున్నాను.

శ్లో. దివ్యంతరిక్షభూమిష్ఠాః పితరో బాంధవాదయః
మృతా అసంస్కృతాయేచ తేభ్యఃపిండం దదామ్యహమ్.

భూమ్యంతరిక్ష పాతాళములయందు నాబంధువులుగాని, పితరులుగాని మృతినొంది సంస్కార హీనులైన వారితరణోపాయమునకై యీపిండము నొసంగుచున్నాను.

శ్లో. యేకేచి త్ప్రేతరూపేణ వర్తంతే పితరోమమ
తేసర్వే తృప్తిమాయాంతు పిండేనానేన శాశ్వతీమ్.

నాపితరులలో నెవరైనను ప్రేతయోనులలో నున్నయెడల వారితృప్తికై యీపిండము నొసంగుచున్నాను.

శ్లో. యేఽబాంధవాబాంధవావా యేఽన్యజన్మనిబాంధవాః
తేషాంపిండో మయాదత్తో హ్యక్షయ్య ముపతిష్ఠతు.

నాబంధువులుగాని, బంధువులు కానివారుగాని, నాపూర్వజన్మమందు బంధువులై యున్నవారుగాని, వారందఱు నే నొసంగు పిండమువలన తృప్తినొంది అక్షయ్యఫలమును బొందుదురు.

శ్లో. పితృవంశే మృతాయేచ మాతృవంశే తథైవచ
గురుశ్వశురబంధూనాం యేచాన్యే బాంధవాదయః.
యే మేకులే లుప్తపిండాః పుత్రదారవివర్జితాః

క్రియాలోపగతాయేచ జాత్యంధాః పంగవస్తథా.
విరూపాఆమగర్భాశ్చ జ్ఞాతాఽజ్ఞాతాః కులేమమ
ధర్మపిండో మయాదత్తో హ్యక్షయ్య ముపతిష్ఠతు.

పితృమాతృ వంశములయందును, శ్వశుర, గురు, బంధు వంశముల యందును, వారి బంధువంశములయందును, నాకు లమందును, పిండాదికముల నొసంగు స్త్రీపురుష సంతతిలేని వారు, సధ్యాదిక్రియానష్టమును పొందినవారు, జాత్యంధులు, కుంటివాండ్రు, కురూపులు, గర్భమందు నశించినవారు, నాకుఁ దెలిసినవారుగాని తెలియనివారుగాని మృతినొందినవా రున్న యెడల వారికి అక్షయ్యఫలము నొసంగునట్లు ఈపిండము నొసంగుచున్నాను.

శ్లో. ఆబ్రహ్మణో యేపితృవంశజాతా మాతు స్తథా వంశభవామదీయాః
వంశద్వయేస్మిన్ మమదాసభూతా భృత్యా స్తథైవాశ్రితసేవకాశ్చ.

బ్రహ్మపర్యంతము నాయొక్క పితృమాతృవంశముల యందు జననమొంది మృతినొందినట్టియు, ఈ రెండు వంశములందు దాస, భృత్య, సేవకాశ్రిత పరంపరకును.

శ్లో మిత్రాణిసఖ్యః పశవశ్చవృక్షా దృష్టాశ్చ స్పృష్టాశ్చ కృతోపకారాః
జన్మాంతరేయే మమసంగతాశ్చ తేభ్యః స్వధాపిండమహందదామి.

మిత్ర, సఖి, పశు, వృక్షసమూహమును, దృష్టిపథమైనటువంటియు, స్పృశ్యతగిలినటువంటియు, నా కుపకార మొనర్చినట్టియు, నాకు సంపర్కము గలట్టియు వారినిగూర్చి యీ ధర్మపిండము నొసంగుచున్నాను. ఈవిధంబున పూర్వోక్తమంత్రములనుఁ బఠించుచు స్త్రీలకు స్త్రీలింగప్రత్యయములను తన్నామాంతమందుఁ జేర్చి ప్రథమమున ప్రథమమాతకు పిండ మొసంగి క్రమముగా స్త్రీలకు పిండమును సమర్పింపవలయును.

స్వగోత్రమునకుగాని, అన్యగోత్రమునకుగాని సంబంధించిన స్త్రీపురుషులకు ప్రత్యేకప్రత్యేకముగాతర్పణ,పిండముల నొసంగవలయును. లేనియెడల నాశ్రాద్ధము, తర్పణము, పిండము నిష్ఫలమగును. పిండపాత్రమున తిలోదకములనిడి తత్పిండ సమూహమునకు త్రివార మభిషేక మొనర్చి ప్రార్థనసేయవలయును.

—క్షమాపణమంత్రము.—

యేచవో త్రయేచాస్తానా నాశంసంతే
యాశ్చవో త్రయాశ్చాస్తా నాశంసంతే
తేచవహంతాంతాశ్చ వహంతామ్.
తృప్యంతుభవత్య స్తృప్యత తృప్యతతృప్యత
పుత్రాన్ పౌత్రా నభివర్ధయంతీ రాపోమధుమతీరిమాః.
స్వధాపితృభ్యో అమృతంరుహానా ఆపోదేవీరుభయాం స్తర్పయంతు
పితౄన్ విసృజ్యచాచమ్యసీక్షిణాః శ్రావయేస్తుశన్.
సాక్షిణఃసంతు మేదేవా బ్రహ్మేశానాదయ స్తథా.

నే నొసంగు పిండములను గ్రహింప నిచ్ఛగల స్త్రీపురుషులు మూడు పురుషాంతరములవఱకు గలవారలు ఈపిండములను గ్రహించి తృప్తినొందుదురు.ముమ్మాటికిని తృప్తినొందుదురు. నాకు పుత్రులు పౌత్రులు కలుగునటు లాశీర్వాదమొసంగుదురు. మధువు లేక అమృతతుల్యమగు నీజలమును నాయొక్క పితరులగు మీరు (స్త్రీపురుషులు) గ్రహించి తృప్తినొందుదురు. అను క్షమాపణమంత్రమును బఠింపుచు పిండవిసర్జన మొనర్పవలయును. తరువాత నాచమన మొనర్చి సాక్షీభూతు లగునటుల బ్రహ్మరుద్రాది దేవతలను ప్రార్థింపవలయును.

శ్లో. గయాంగయాం సమాసాద్య పితౄణాం నిష్కృతిః కృతా
ఆగతోస్మి గయాందేవ పితృకార్యే గదాధర.

నేను నాపితరుల యుద్ధారణార్థమై గయాక్షేత్రమున కేతెంచి, శ్రాద్ధాదికర్మములచే నుద్ధారణ మొనర్చితిని. దేవా, గదాధరా.

శ్లో. త్వమేవసాక్షీ భగవా న్ననృణోహ మృణత్రయాత్.

నేను ఋణత్రయమలనుండి విముక్తుఁడనైతిని. ఇందుకొఱకు నీవుసాక్షిభూతుఁడవై యుండవలెను అనిప్రార్థింపవలయును. నారదా! యిట్లుపూర్వోక్తప్రకారముగా ప్రేతపర్వతమందు శ్రాద్ధ మొనర్చి, తత్పర్వతమును దిగి, సక్తుపిష్టమును దిలలను గలిపి దక్షిణాభిముఖముగా నపసవ్యముగా,

శ్లో. యేకేచి త్ప్రేతరూపేణ వర్తంతే పితరోమమ
తేసర్వే తృప్తి మాయాంతు సక్తుభి స్తిలమిశ్రితైః.

నాపితరులలో నెవరైనను ప్రేతయోనులయం దున్నయెడల, వారు ఈతిలమిశ్రసక్తుపిష్టముతో తృప్తినొందవలెను.

శ్లో. ఆబ్రహ్మస్తంభపర్యంతం యత్కించి త్సచరాచరమ్
మయా దత్తేన తోయేన తృప్తి మాయాంతు సర్వశః.
ప్రేతత్వాచ్చవిముక్తాః స్యుః.

బ్రహ్మమొదలు స్తంభపర్యంతముగల మనుష్యాదిక,పర్వతాదికవృక్షాదికములు అన్నియు నేనొసంగునీజలమువలనతృప్తి నొంది ప్రేతత్వమునువీడవలయును. అనుమంత్రమునుపఠించుచు, తిలమిశ్రసక్తుపిష్టమునుజలమును ప్రేతపర్వతమునఁ జల్లవలయును. నారదా! యిట్లుచేసిన ప్రేతత్వమందుండుపితరులు వెలువడి

ముక్తినొందుదురు. ఈఫలమువలన వాని కులమందు మఱియె వరును ప్రేతత్వమును బొందరు. ప్రేతములకు ముక్తినొసంగు నీప్రేతపర్వతము గయాసురుని శిరమునందు విఖ్యాతమగు చున్నది.

మఱియు తీర్థమంత్రాదిరూపములచే నాదిగదాధరుఁడు స్థితుఁడై ప్రఖ్యాతిగాంచుచుండెను.

షష్ఠాధ్యాయము.

# సప్తమాధ్యాయము.

---

నారదా! పంచతీర్థములలోని యుత్తరమానసతీర్థ స్నానవిధానంబును జెప్పుచున్నాను. వినుము. ప్రథమమున కుశాగ్రంబులతో తత్తీర్థోదకమును శిరంబున మార్జన మొనర్చుకొని స్నానము సేయవలయును. స్నానము సేయునపుడు:—

శ్లో. ఉత్తరేమానసే స్నానం కరోమ్యాత్మవిశుద్ధయే
సూర్యలోకాదిసంసిద్ధిసిద్ధయే పితృముక్తయే.

ఆత్మశుద్ధికొఱకును, సూర్యలోకాద్యుత్తమలోకప్రాప్తికొఱకును పితరుల ముక్తికొఱకు నుత్తరమానసతీర్థమందుస్నానము సేయుచున్నాను. అనుమంత్రమును బఠింపవలయును. ఈ విధంబున స్నానమొనర్చి తర్పణ, సపిండశ్రాద్ధములు సలుపవలయును. పిమ్మట సూర్యునకు నమస్కారపూజనములు సలుపవలయును. అట్లు సలిపిన, పితరులు సూర్యలోకమునుఁ బొందుదురు. సూర్యునకు నమస్కారము సేయునపుడు,

శ్లో. ఓంనమో భానవే భర్త్రే సోమభౌమజ్ఞరూపిణే
జీవభార్గవశనైశ్చర రాహుకేతుస్వరూపిణే.

సమస్తజీవములకుఁబోషకుఁడగు భాస్కరునకు నమస్కారము. సోమ, మంగళ, బుధ, బృహస్పతి, శుక్ర, శని, రాహు కేతు స్వరూపునకు నమస్కారము. అనుమంత్రమును బఠింపవలయును.

పిమ్మట మౌనవ్రతుఁడై యుత్తరమానసతీర్థమునుండి బయలువెడలి దక్షిణమానస తీర్థమునకు రావలయును. దక్షిణ

మానసమందు మూఁడుతీర్థములు గలవు. ఇందు విధ్యుక్తముగా స్నానమొనర్చి శ్రాద్ధములు సలుపవలయును. ఉత్తరభాగమున ముక్తిప్రదాయిని యగు నుదీచ్యనామతీర్థ మొకటిగలదు. ఈ తీర్థమందు స్నానమొనర్చుమనుజులు స్వశరీరముతో స్వర్గలోకమున కరుగుదురు. దక్షిణమానస, సోదీచ్యతీర్థములకు మధ్యభాగమునఁ ద్రిలోకప్రసిద్ధమగుకనఖలతీర్థమనుతీర్థ మొకటిగలదు. ఇందు స్నానమొనర్చినమనుజులశరీరము సువర్ణచ్ఛాయగలిగి పవిత్రమై యొప్పును. కనఖలతీర్థమునకు దక్షిణమున దక్షిణ మానసతీర్థమనుతీర్థము గలదు. ఇందు స్నానముసేయవలయును. స్నానము సేయునపుడు.

శ్లో. దక్షిణేమానసేస్నానం కరోమ్యాత్మవిశుద్ధయే
సూర్యలోకాదిసంసిద్ధి సిద్ధయే పితృముక్తయే.
బ్రహ్మహత్యాదిపాపౌఘ ఘాతనాయ విముక్తయే
దివాకర కరోమీహ స్నానం దక్షిణమానసే.

ఆత్మశుద్ధికొఱకును పితరులకు సూర్యలోకాద్యుత్తమలోకప్రాప్తికొఱకును ఈ దక్షిణమానసతీర్థమందు స్నానము సేయుచున్నాను. దివాకరా, బ్రహ్మహత్యాది మహాపాప పరిహారార్థమును, పితృముక్తికొఱకును దక్షిణమానసతీర్థమందు స్నానముసేయుచున్నాను. అను మంత్రమును పఠింపవలయును. ఈప్రకారము స్నానమొనర్చి సూర్యభగవానునకు నమస్కరించి ధ్యానముసేయవలయును. అట్లు సలిపిన నాదిత్యుఁడు పితరులను స్వర్గమునకనుపును. సూర్యునకు నమస్కరించునపుడు,

శ్లో. నమామి సూర్యతృప్త్యర్థం పితౄణాం తారణాయవై
పుత్రపౌత్రధనైశ్వర్యాయురారోగ్యాభివృద్ధయే.

సూర్యభగవానుఁడా! పితరులతృప్తికొఱకును, మోక్ష ప్రాప్తికొఱకును, పుత్ర, పౌత్ర, ధనై, శ్వర్యాయురారోగ్యాభివృద్ధికై నీకు నమస్కారము. అనుమంత్రమును బఠింపవలయును. ఈప్రకారము స్నానము, సూర్యునకు నమస్కారార్చనములు సలిపి శ్రాద్ధము సేయవలయును. అట్లు సలిపిన శ్రాద్ధ మత్యుత్తమమగును. ఫలప్రాప్తమగును. ఇట్లు సూర్యునకు పితృముక్తికొఱకు నమస్కార మొనర్చి దక్షిణమానసమున నుండి ఫల్గుతీర్థమునకురావలయును. ఫల్గుతీర్థమందు శ్రాద్ధమొనర్చినమనుజులకు తత్పితరులతో ముక్తి లభించును. శ్రీమహావిష్ణువు, బ్రహ్మప్రార్థనానుసరణముగ ఫల్గుతీర్థరూపమును వహించెను. దక్షిణాగ్నియందు హవనమొనర్చు సమయమున ఫల్గుతీర్థ ముత్పన్నమయినది. ఇందుఁద్రిలోకములయందుఁ గల సమస్తతీర్థములు దేవతాసహితముగా స్నాన మొనర్చుటకు వచ్చుచుండును. గంగానది శ్రీమహావిష్ణువు చరణకమలముల నుండి వెలువడినది ఆదిగదాధరుఁడు స్వయముగా జలరూపము వహించి ఫల్గుతీర్థమనునామమున విఖ్యాతమగుచుండెను. అందువలన ఫల్గుతీర్థము గంగాధికమై సుగంధశోభితమై యొప్పుచున్నయది. ఆదిగదాధరస్వరూపమైన ఫల్గుతీర్థమందు స్నానమొనర్చినఫలము, వేవేల యశ్వమేధయాగఫలమునకన్న సహస్రాధికమై యొప్పుచున్నయది. ఇట్టిఫల్గుతీర్థమందు మనుజులు స్నాన తర్పణము లొనర్చి, స్వవేదశాఖానుసారముగ పిండాత్మక శ్రాద్ధమొనర్చి, పితామహా, మహాదేవ, శివే, శానఘోర, వామదేవ, శంభుప్రభృతి దేవవర్యులకు నమస్కారము సేయవలయును. ఫల్గుతీర్థమందు స్నానమొనర్చి ఆదిగదాధరుని దర్శనము సేయువా

రలు తమతో పూర్వమందుఁ బది పురుషాంతరములు, పరమం దుఁబది పురుషాంతరములు తరించి సుగతినిఁ జెందుదురు.

శ్లో. ఓం నమో వాసుదేవాయ నమ స్సంకర్షణాయచ
ప్రద్యుమ్నా యానిరుద్ధాయ శ్రీధరాయచ విష్ణవే.

వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధ శ్రీధరాది నామములచే ప్రఖ్యాతుండగు శ్రీమహావిష్ణువునకు నమస్కారము నేయుచున్నాను. అనుమంత్రమును బఠింపుచు నాదిగదాధరున కర్చన నమస్కారములు సలుపవలయును. పంచతీర్థమందు స్నానమొనర్చు మనుజులు తమ పితరులతో విష్ణులోకమునుఁ బొందుదురు. ఆదిగదాధరుని పంచామృతస్నానమొనర్చిపుష్పవస్త్రాద్యలంకారములతోఁ బూజింపక తత్పదమందు శ్రాద్ధముసలిపిననాశ్రాద్ధమువ్యర్థమై ఫలశూన్యమగును. నాగకూట, గృధ్రకూట, యజ్ఞసంభోత్తరమానస, ముండపృష్ఠపర్యంతము గయాసురుని శిరస్సయి, ఫల్గుతీర్థమనఁబడుచున్నది ఫల్గుతీరమందు స్నానమొనర్చిన సమస్త పితరులు మోక్షమును పొందుదురు. ఇంతవఱకు గయాసురుని శిరము వ్యాప్తమైయున్నయది. ఇందు శ్రాద్ధమొనర్చిన లభించుఫల మక్షయ్య మగును. ఇయ్యది ప్రథమదివసమున చేయుక్రమము.

రెండవదివసమున ధర్మరాజు యజ్ఞమొనర్చిన ధర్మారణ్యమున కరిగి అచ్చట శ్రాద్ధమొనర్పవలయును. అందు శ్రాద్ధమొనర్చిన, పితరులు బ్రహ్మలోకమున కరుగుదురు. అందుమతంగవాపియందు స్నానతర్పణము లొనర్చి శ్రాద్ధము సలిపి మతంగేశుని దర్శించి నమస్కారము సేయవలయును.

శ్లో. ప్రమాణం దేవతాస్సంతు లోకపాలాశ్చ సాక్షిణః
మయాగత్య మతంగేఽస్మిన్ పితౄణాం నిష్కృతిఃకృతా.

సమస్త దేవవర్యులారా! లోకపాలకులారా! నేను మతంగతీర్థమున కరుదెంచి పితరుల నుద్ధారణ మొనర్చితిని. అందుకుగాను మీరు సాక్షీభూతులై యుండవలయును. అనుమంత్రమును బఠింపవలయును. మతంగవాపి యూపస్తంభముల మధ్యమందున్న ధర్మరాజ, ధర్మేశ్వరునకు నతు లొనర్చి,మహాబోధితరువునకు,

శ్లో. నమస్తేఽశ్వత్థరాజాయ బ్రహ్మవిష్ణుమహేశ్వర
బోధిద్రుమాయ పితౄణాం కర్తౄణాంతారణాయచ.
ఏకాదశోఽసి రుద్రాణాం వసూనా మష్టమోవసుః
నారాయణోఽసి దేవానాం వృక్షరాజోఽసి పిప్పల.

బ్రహ్మ విష్ణు శివస్వరూపా! వృక్షరాజా! అశ్వత్థవృక్షమా! నీకు నమస్కారము. బోధిద్రుమమా! శ్రాద్ధమొనర్చుటవలన పితరులకు మోక్షమొసంగునట్టినీకు నమస్కారము. ఏకాదశరుద్రాష్టవసు, సమస్తదేవతామధ్యమున నారాయణస్వరూపమునవిరాజిల్లువృక్షరాజా! పిప్పలివృక్షమా! నీకు నమస్కారము. అనుమంత్రమునుఁ బఠించుచు నమస్కరింపవలయును.

శ్లో. అశ్వత్థరూపిణందేవం శంఖచక్రగదాధరమ్
నమామి పుండరీకాక్షం శంఖరూపధరంహరిమ్.

అశ్వత్థవృక్షరూపమునను, శంఖరూపమునను విరాజిల్లు శంఖచక్రగదాద్యాయుధశోభితుం డగు పుండరీకాక్షునకు నమస్కారము.

శ్లో. యేఽస్మత్కులేమాతృవంశే బాంధవాదుర్గతింగతాః
త్వద్దర్శనా త్స్పర్శనాచ్చ స్వర్గతింయాంతు తేఽక్షయమ్.

నావంశమందు, మాతృవంశమందు, బంధుకులమందు ఎవరైన దుర్గతిని జెందినవారున్నయెడల వారికందఱికి నేనొనర్చు నీదర్శనస్పర్శనములవలన నక్షయమగు స్వర్గతి నొసంగుము.

శ్లో. ఋణత్రయం మయాదత్తం గయా మాగత్యవృక్షరాట్
త్వత్ప్రసాదా న్మహాపాపా ద్విముక్తోఽహం భవార్ణవాత్.

వృక్షరాజా! నేను గయాక్షేత్రమున కరుదెంచి ఋణత్రయములనుండి విముక్తుఁడనయితిని. నీప్రసాదమువలన, నేను మహాపాపములనుండియు, భవసాగరమునుండియు వెలువడితిని. అను మంత్రమును పఠించుచు వృక్షరాజమునకు నమస్కరింపవలయును.

మూఁడవదివసమున విధ్యుక్తముగా బ్రహ్మశిరస్తీర్థమందు స్నానమొనర్చి పిండాత్మకశ్రాద్ధమొనర్పవలయును. బ్రహ్మశిరస్తీర్థమందు స్నానముసేయునపుడు,

శ్లో. స్నానం కరోమి తీర్థేఽస్మి౯ ఋణత్రయవిముక్తయే.

యూపకూప మధ్యస్థమగు నీ బ్రహ్మశిరస్తీర్థమందు ఋణత్రయ విముక్తికొఱకు స్నానముచేయుచున్నాను. అను మంత్రమును పఠింపవలయును. ఇందు స్నాన, తర్పణ, శ్రాద్ధ, పిండదానము లొనర్చిన, పితరులు బ్రహ్మలోకమున కరుగుదురు. శ్రాద్ధపిండదానముల విశుద్ధికొఱకు, యూపస్తంభము బ్రహ్మ యొనర్చిన యాగకాలమందు నుత్పన్నమైనది. బ్రహ్మశిరస్తీర్థమందు సపిండశ్రాద్ధ మొనర్చిన, పితరులు ముక్తినొందుదురు. యూపమునకుఁ బ్రదక్షిణమొనర్చిన వాజపేయయాగ ఫలము లభించును. పిమ్మట బ్రహ్మనుగూర్చి,

శ్లో. ఓం నమో బ్రహ్మణేఽజాయ జగజ్జన్మాధికారిణే
భక్తానాంచ పితౄణాంచ తారణాయ నమోనమః.

జగజ్జన్మకారణ భూతుండవగు స్వామీ నీకు నమస్కారము. పితరులకును, భక్తవర్యులకును మోక్షమొసంగు దేవా, నీకువందనము. అనుమంత్రమును బఠించుచు నమస్కారము సేయవలయును. ఇట్లు నమస్కరించినవారి పితరులు మోక్షప్రాప్తి నొందుదురు. గోప్రచార సమీపమున బ్రహ్మకల్పితామ్రవృక్షమొండుగలదు. ఆవృక్షమున జలమును ప్రోక్షించిన, పితరులు ముక్తినొందుదురు. కాఁబట్టి,

శ్లో. ఆమ్రవృక్షసరోద్భూతం సర్వదేవమయంతరుమ్
విష్ణురూపం ప్రసించామి పితౄణాం ముక్తిహేతవే.

బ్రహ్మసరమం దుత్పన్నమై విష్ణ్వాది సమస్తదేవతా స్వరూపముతో నొప్పు నామ్రవృక్షమందు నాయొక్క సమస్త పితరుల ముక్తికొఱకు జలమును ప్రోక్షించుచున్నాను. అనుమంత్రమును పఠించుచు నామ్రవృక్షమున జలాభిషేకము సేయవలయును. తొల్లి యొకానొకముని పవిత్రవంతుఁడై, ఆమ్రవృక్షమూలమునఁ దర్పణ మొనర్చెను. తత్తర్పణోదకమువలన నామ్రవృక్షము ప్రోక్షింపఁబడినందున తత్పితరులు ముక్తినొందిరి. ఇందువలననే "ఏకక్రియాద్వ్యర్థకరీ" యనువాక్యము ప్రసిద్ధమయ్యెను. పిమ్మట,

శ్లో. యమరాజధర్మరాజౌ నిశ్చలార్థం వ్యవస్థితౌ
తాభ్యాంబలిం ప్రదాస్యామి పితౄణాం ముక్తిహేతవే.

గయాసురుని నిశ్చలార్థమందు నిలిచియున్న ధర్మరాజా, నాపితరులకు ముక్తిలభింపఁజేయుటకుగాను నీకు బలియొసంగుచున్నాను. అను మంత్రమును బఠింపుచు యమరాజునకును,

శ్లో. శ్వానౌద్వౌశ్యామశబలౌ వైవస్వతకులోద్భవౌ
తాభ్యాంబలింప్రదాస్యామి రక్షేతాంపథిసర్వదా.

వైవస్వతకులమందుత్పన్నమై శ్యామశబలముల నామమున నొప్పు మీకు, నాపితరులను స్వర్గమార్గమున నిరంతరము సంరక్షించుటకుగాను బలినొసంగుచున్నాను. అను మంత్రమునుఁ బఠించుచు శ్వానబలియు నొసంగి స్నానము సేయవలయును. తరువాత,

శ్లో. ఐంద్రవారుణవాయవ్యా యామ్యానైరృతాస్తథా
వాయసాః ప్రతిగృహ్ణంతు భూమ్యాంపిండం మయోజ్ఝితమ్.

ఇంద్ర, వరుణ, వాయవ్య, యమ, నైరృతి భాగములయందలి వాయసములు నేను భూమియందిడిన పిండమును స్వీకరింప వలయును. అనుమంత్రమును పఠించుచు కాకబలియొసంగవలయును.

నాలవదివసమున, ఫల్గుతీర్థమున స్నానాదికములొనర్చి, విష్ణుపదమందు విధ్యుక్తముగా సపిండశ్రాద్ధమును సలుపవలయును. ఫల్గుతీర్థము నాశ్రయించి సాక్షాద్గయాసురుని శిరము విరాజిల్లుచు, తత్తీర్థనామమున నొప్పుచున్నయది. నగపర్వతము, జనార్దనస్థానము, బ్రహ్మకూపము, ఉత్తరమానసము, పితామహేశ్వరస్థానములచే నొప్పు ప్రదేశము, ఫల్గుతీర్థనామమున, దేవతాదుర్లభమై విరాజిల్లుచున్నయది. క్రౌంచపదపర్వతము మొదలు ఫల్గుతీర్థమువఱకు గయాసురుని శిరము వ్యాపించియున్నది. ఇయ్యది గయాసురుని ముఖమని వాడుదురు. ఇందు శ్రాద్ధాదులు సలిపిన, తత్ఫల మక్షయ మగును. ముండపృష్ఠాద్రి మొదలు ఫల్గుతీర్థపర్యంత మాదిగదాధరుఁడు వ్యక్తావ్యక్తరూపముల విరాజిల్లుచుండెను. ఈ స్థలమందు

విష్ణ్వాది సమస్త దేవతలు పదరూపముల నొప్పుచు పితరులకు
మోక్ష మొసంగుచుందురు. ఇందు విష్ణుపదమును దర్శించిన,
సమస్తపాపములు నశించును విష్ణుపద దర్శన పూజనములు
సలిపి, తత్పదమం దాత్మసహిత పిండదాన మొనర్చిన, తత్ఫ
లమనంతమై, ఆత్మసహిత సహస్రకులములను తరింపఁజేసి పరమ
కళ్యాణ ప్రదమగు విష్ణుపదము నొసంగును. రుద్రపదమందు
శ్రాద్ధమొనర్చిన నూఱుకులములతో కైలాసమును, బ్రహ్మపద
మందు శ్రాద్ధమొనర్చిన సహస్రకులములతో బ్రహ్మపదమును
లభించును. దక్షిణాగ్నిపదమందు శ్రాద్ధమొనర్చిన వాజపేయ
యాగఫలమును, గార్హపత్యాగ్నిపదమందు శ్రాద్ధమొనర్చిన
రాజసూయ యాగఫలమును, ఆహవనీయాగ్నిపదమందు శ్రాద్ధ
మొనర్చిన నశ్వమేధయాగ ఫలమును, సభ్యాగ్నిపదమందు
శ్రాద్ధమొనర్చిన జ్యోతిష్టోమయాగఫలమును నొసంగును. అవ
సథ్యాగ్నిపదమందు శ్రాద్ధమొనర్చిన మనుజునకుఁ బితృహిత
ముగా సోమలోకమొసంగును. ఇంద్రపదమందు శ్రాద్ధమొన
ర్చిన నింద్రలోకము లభించును. అగస్త్య, క్రౌంచ, మతంగపద
ములయందు శ్రాద్ధమొనర్చిన, పితరులు బ్రహ్మలోకమును జేరు
దురు. సూర్యపదశ్రాద్ధమువలన, పంచమహాపాతక నాశనమై
పితరులకు సూర్యలోకమును, స్వామికార్తికేయపద శ్రాద్ధము
వలన శివలోకము, గణేశపదశ్రాద్ధమువలన రుద్రలోకమును
లభించును. గజకర్ణతీర్థమందు తర్పణమొనర్చిన, స్వర్గలోకము
లభించును. సమస్తపదములలో కశ్యప, విష్ణు, రుద్ర, బ్రహ్మపద
ములు శ్రేష్ఠములు. నారదా! ఆరంభమునఁగాని అంత్యమునఁ
గానియీపదములలో నెద్దానియందు శ్రాద్ధమొనర్చినను తత్క
ర్తకు శ్రేయస్సు లొనగూడును. పూర్వము భరద్వాజమహర్షి,

కశ్యపపదమందు శ్రాద్ధముసేసి పిండమొసంగ నుద్యుక్తుఁ డగు సమయమున, తత్పదమును భేదించి కృష్ణ, శుక్లవుర్ణంగులుగల హస్తద్వయము వెలువడెను. అయ్యదిచూచి మహర్షి సందేహ మనస్కుఁడై యేమిచేయవలయు నది తోఁచక తనతల్లియగు శాంతకీవృత్తాంతమును విన్నవించి, యేహస్తమందు పిండము నిడవలయునో యాజ్ఞయొసంగుమని ప్రార్థించెను. అంతటశాంత తనకుమారునితో బుద్ధిశాలివగు భారద్వాజా! కృష్ణవర్ణహ హస్తమందు పిండము నొసంగుమని పలుక, తత్ప్రకార మొన ర్చుటకు సిద్ధుఁడయ్యెను. అయ్యది శుక్లవర్ణహస్తము చూచి, భారద్వాజునితో, నీవు నాకు ఔరసపుత్రుఁడవు, నావీర్యమువల నజన్మించితివి. ఈకారణమువలన నాకుఁబిండమొసంగుము.అని పలికెను. ఈమాటలువిని కృష్ణహస్తము, భారద్వాజా! నీవునాక్షే త్రమువలన జన్మించితివి. ఈకారణమువలన నాకుబిండమొసం గుము. అని పలికెను. అంతట శుక్లహస్తము, భరద్వాజునితో, నీతల్లి స్వైరిణి, నీవు నావీర్యమువలన జన్మించితివి. అందువలన నాకు బిండమొసంగుట యుచితమని పలికెను. అంతట నీ కృ ష్ణశుక్ల హస్తముల వాద ప్రతివాదముల నాలకించి, శాంత త నకుమారునితో నుభయులకును పిండమునొసంగుమని పలుక, తత్ప్రకార ముభయులకును భరద్వాజుఁడు కశ్యపపదమందు పిండమొసంగెను. భరద్వాజుఁ డొసంగిన పిండములను శుక్ల కృష్ణహస్తములుగల వార లుభయులును స్వీకరించి, తృప్తులై విమానారూఢులై బ్రహ్మలోకమున కరిగిరి. శ్రీరామచంద్రుఁడు రుద్రపదమందు శ్రాద్ధమొనర్చి పిండమొసంగుట కుద్యుక్తుఁడ గు సమయమున, దశరథుఁడు పసరురంగుగల హస్తములతో స్వర్గమునుండి చనుదెంచి, పిండమునకై హస్తమును చాచెను.

శ్రీరాముఁడు దశరథుని హస్తమందు పిండమునిడక, రుద్ర పదమందుంచెను. అంతట శాస్త్రార్థాతిక్రమణభీతుఁడై దశరథుఁడు పుత్రా ! రామచంద్రా! నీవు నన్ను దరింపఁజేసితివి. ఇందువలన నాకు రుద్రలోకము లభించినది. నీవు నాహస్తమందు పిండమిడినచో నాకు స్వర్గతి లభింపదు. అట్లు సలుపక నీవు రుద్రపదమందు పిండమిడి రుద్రలోక మొసంగితివి. నీవు చిరకాలము రాజ్యమొనరించి, భూసురులను, ప్రజలను రక్షించి, సదక్షిణాకయజ్ఞము లొనర్చి, పశు, పక్షి, మృగ, కీట, పతంగ సహితముగా అయోధ్యాపురముతో వైకుంఠమున కరుగుము. అని పలికి రుద్రలోకము ననుసరించి చనెను. భీష్ముఁడు, దివ్య విష్ణుపదమందు తన పితరుల నావాహన మొనర్చి శ్రాద్ధము సలిపి, పితరులకు పిండదాన మొసంగ సిద్ధుఁడయ్యెను. అంతట శంతనుమహారాజు గయాసుర శిరమందున్న విష్ణుపదమునుండి హస్తద్వయముతో వెలువడెను. భీష్ముఁడు శంతనుహస్తమందు పిండము నిడక, విష్ణుపదమందు పిండమునుంచెను. అంతట శంతనుఁడు సంతుష్టుఁడై భీష్మునితో, పుత్రా ! నీబుద్ధి శాస్త్రార్థములయందు నుంచి నిశ్చలుఁడవై ప్రవర్తింపుము. త్రికాలజ్ఞానసంపన్నుఁడవై, అంతమందు విష్ణులోకమునుఁ బొందుము. నీకు నీయిచ్ఛానుసారముగ మరణము సిద్ధించును. అని పలికి ముక్తిమార్గ మనుసరించి చనెను. కనకేశ, కేదార, నారసింహ, వామన, రథమార్గములనుఁ బూజించిన, సమస్తపితరులు తరించెదరు. ఎవరి గోత్రనామములతో గయాసురునిశిరమునందు పిండదానమొసంగుదురో, వారు నరకమందున్నయెడల స్వర్గమును, స్వర్గమందున్నయెడల మోక్షమును పొందుదురు. గయాసురుని శిరమునందు శమీపత్ర ప్రమాణముగల యన్నపిండ

ముగాని, కందమూల ఫలపిండముగాని దానమొసంగిన స్వర్గ లోక మొనగూడును. విష్ణ్వాదిపదములయందు సపిండశ్రాద్ధము లొనర్చిన, ఆయాపదాధి దేవతలు, పితరులకు ఆయాలోకముల నొసంగుదురు ముండపృష్ఠాద్రియందుఁగల సమస్తతీర్థపదముల యందు పూర్వోక్తానుసరణి సపిండశ్రాద్ధము లొనర్చిన మనుజు లకు పితరులతో, అవినాశ, రోగరహిత బ్రహ్మలోకము లభిం చును.

ఐదవ దివసమున సమస్తతీర్థములలో నుత్తమోత్తమ మగుగదాలోలతీర్థమందుస్నాన మొనర్చి సపిండశ్రాద్ధమునుసలు పవలయును. అట్లు సలిపినమనుజులు పితరులతో బ్రహ్మలోకము నుఁ బొందుదురు. హేతినామరక్కసుని శ్రీమహావిష్ణువు గదా యుధముతో వధించి, తద్గద నీతీర్థమందు క్షాళన మొనర్చిన కతంబున, గదాలోల తీర్థమన ప్రఖ్యాతమగుచుండెను.

శ్లో. గదాలోలేమహాతీర్థే గదాప్రక్షాలితేపరే
స్నానంకరోమి శుద్ధ్యర్థ మక్షయ్యాయ స్వరాప్తయే.

శ్రీమహావిష్ణువు శ్రేష్ఠమైన తనగదాయుధమును హేతి వధానంతరమున ప్రక్షాళన మొనర్చిన గదాలోల మహాతీర్థ మందు, శుద్ధ్యర్థము, మోక్షార్థము స్నానముసేయుచున్నాను. అనుమంత్రమునుఁ బఠింపుచు గదాలోలతీర్థమందు స్నానముసే యవలయును. తదనంతరము గయాక్షేత్రమందు నివసించి యుందు బ్రహ్మకల్పిత బ్రాహ్మణులకు భోజనమొసంగి తృప్తిసలు పవలయును. ఈ బ్రాహ్మణులు తృప్తిఁబొందిన, పితృసహితముగా దేవతలు తృప్తులై ప్రసన్నులగుదురు ప్రయత్నపూర్వకముగ నక్షయ వటచ్ఛాయయందు అన్నశ్రాద్ధమొనర్చి, సావధానచి త్తంబున వటేశ్వరునకు నమస్కరించి పూజలొనర్చిన, సనాతన

బ్రహ్మపదమును బడయుదురు. వటవృక్షచ్ఛాయయందుశాకము తోఁగాని యుదకముతోఁగాని బ్రహ్మకల్పిత బ్రాహ్మణుని కొక్కని కైనను భోజనమొసంగిన, కోటిబ్రాహ్మణుల కన్నదాన మొసంగిన ఫలము లభించును. గయాసురశిరమునందు, అక్షయవట సమీపమున పితృముక్తికొఱకు నొసంగినదాన మక్షయ మగును. గయాక్షేత్రమందు వసియించియున్న సమస్తదేవతా ప్రీత్యర్థము షోడశమహాదానము లాక్షేత్రపురోహితుల కొసంగవలయును. వస్త్రగంధాదులతో విధిపూర్వకముగా శ్రీమహా విష్ణువును పూజింపవలయును.

శ్లో. ఏకార్ణవే వటస్యాగ్రే యఃసేతేయోగనిద్రయా
బాలరూపధరస్తస్మై నమస్తే యోగశాయినే.

సమస్తభూమండలము ఏకార్ణవమై యొప్పునపుడు వట పత్రమందు బాలరూపమున యోగనిద్రావలంబకుఁడగు విష్ణువు నకు నమస్కరించుచున్నాను. అను మంత్రమున శ్రీమహావిష్ణు వును.

శ్లో సంసారవృక్షశస్త్రాయ సర్వపాపహరాయచ
అక్షయ్యబ్రహ్మదాత్రేచ నమోఽక్షయవటాయవై.

సంసారవృక్షమును నాశ్రయించిన పాపకీటకముల నాశన మొనర్చువటవృక్షమా, నీకు నమస్కారము.

శ్లో. అక్షయ్యబ్రహ్మదాత్రేచ
నమోక్షయవటాయవై.

అవినాశబ్రహ్మలోక మొసంగువటవృక్షమునకు నమస్కారము సేయుచున్నాను. అను మంత్రమున వటవృక్షమును.

శ్లో కలౌమహేశ్వరాల్లోకా యేనతస్మాద్గదాధరః
లింగరూపంభవంతంచ వందేశ్రీప్రపితామహమ్.

కలియుగమందు మహేశ్వరస్వరూపముతో లింగరూపమున విలసిల్లునాదిగదాధరునకును బ్రపితామహునకును నమస్కారము. అను మంత్రముతో నాదిగదాధరునకును బ్రపితామహునకును నమస్కారము సేయవలయును.

సప్తమాధ్యాయము.

---

## అష్టమాధ్యాయము.

నారదా! పూర్వమందు గయుఁడను రాజవర్యుఁడు యజ్ఞమొనర్చి, విశేషాన్నదక్షిణదానము లొసంగి భూసురులనుఁదృప్తిపఱచెను. యాగకాలమందు దానపూర్వకముగ వెచ్చించిన ద్రవ్యమును గణనసేయుట కేరికిని శక్యముకాకపోయె. ఆసమయమందు నిరుపదిమ్మె దన్నపర్వతములును,భూమియందలి సైకతరేణువులవలె, దివమందలి తారాగణముమాడ్కి గణనాతీతములగు సువర్ణద్రవ్యములను భూసురులకు దానమొసంగెను. గయరాజొనర్చిన విధంబున మున్నెవరును యాగకాలమున దానధర్మము లొనర్చియుండలేదు ముందొనర్పఁజాలరు. సమస్తదేశభూసురులును గయరాజువలన దక్షిణలను స్వీకరించి సంతృప్తులై తమతమ నివాసంబుల కరిగిరి. గయుండొనర్చిన జన్నమునకు విష్ణ్వాదిబృందారకులు తృప్తినొంది ప్రసన్నులై గయుని పాలికరిగి, రాజా! నీవొనర్చిన క్రతురాజంబునకు మేము సంతసించితిమి. నీవలయుదానిఁగోరుము. ఇచ్చెదమనిపలికిరి. అంతట గయుండు విష్ణ్వాదిదివ్యులతో, మీరు నాయందుఁబ్రసన్నులరై వర మొసంగఁదలంచినయెడ, గయాక్షేత్రనివాసులగు బ్రాహ్మణులకు మున్ను పితామహునిచే నొసంగఁబడిన శాపంబున

ముక్తినొసంగి, యాగాదులయందు పూజార్హత కలుగఁజేయ వలయును. గయాశ్రాద్ధవిధాన పటిష్ఠులగు గౌతమ, కాశ్యప, కౌత్స,కౌశిక, కణ్వ, భారద్వాజ, జౌశనస, వాత్స్య, పరాశర, సనత్కుమార,మాండవ్య, లౌగాక్షి, లోమశ, వాసిష్ఠాత్ర్యాది చతుర్దశమూర్తులమతంబు వేదసమ్మతమై యొప్పునటుల, వీరి వాక్యమునకును మాన్యత నొసంగవలయును. మఱియు నీ క్షేత్రము నాపేరున విఖ్యాతమగునటుల వరమొసంగ వయునని ప్రార్థింప, "ఏవంభవతు" అని దేవత లంతర్ధాను లయిరి. గయరాజు సమస్తరాజ భోగముల ననుభవించి, అంతమందు విష్ణులోకమున కరిగెను.

మున్ను విశాలపురమును విశాలుఁడను రాజు పాలించుచుండెను. అతఁడు సంతానహీనుఁడై చింతించుచు, బ్రాహ్మణులను రావించి సభక్తికముగాఁ బూజించి, భూసురవర్యులారా! నాకు పుత్రప్రాప్తియగుట కెద్దియేని యుపాయమును సెలవిండు. అని ప్రార్థించెను. అంతట భూసురులు విశాలుని భక్తివినయములకు సంతసిల్లి, రాజా! నీవు గయాక్షేత్రమునకరిగి విధిపూర్వకముగా పిండదాన మొనర్పుము. అందువలన నీవాంఛిత మొనగూడునని వచించిరి. భూసుర వచనానుసారముగా విశాలరాజు గయాశ్రాద్ధమొనర్చి, తన యీప్సితమును వడసెను. పిండదాన మొసంగుసమయమున, నాకాశమార్గమున, శ్వేత, రక్త, కృష్ణవర్ణములు గల ముప్పురు పురుషులు విశాలునకుఁ గానవైరి. విశాలుఁడు వారిని జూచి, మీర లెవ్వారలని ప్రశ్నించెను. అందు విశాలుని ప్రశ్న నాలించి శ్వేతవర్ణపురుషుఁడు, నేను నీ తండ్రిని, స్వర్గలోకమునుండి వచ్చుచుంటిని. ఈ బ్రహ్మఘాతకుఁడు, పాపాత్ముఁడు నగురక్తవర్ణపురుషుఁడు నాకు తండ్రి,

నీకు తాత, ఋషిఘాతకుఁడగు నీ కృష్ణవర్ణపురుషుఁడు నాకు తాత, నీకు ప్రపితామహుఁడు, వీరుభయులు చిరకాలమునుండి యధోముఖులై నరకమందు బహుదుఃఖముల ననుభవించుచున్నవారలు. నీవొనర్చిన పిండదానములవలన వీరుభయులు న్నరకమునుండి వెలువడి ముక్తినొందుచున్నారు. పుత్రా! నీవు పిండదానమొసంగి మమ్ముల ముగ్గురను తరింపఁజేసి మాకు స్వర్గమొసంగితివి. శత్రునాశకా! నీవొసంగిన జలములవలన మేము తృప్తులమై ప్రసన్నులమైతిమి. ఈ విధంబుననే పుత్రులు తమ పితరులకు తృప్తిసలిపి స్వర్గప్రాప్తులఁ జేయవలయును. నీవు చిరకాలము రాజ్యమొనర్చి, సమస్తభోగముల ననుభవించి, సదక్షిణాకయజ్ఞములొనర్చి, అంతమందు వైకుంఠమునుఁ జేరుదువుగాక. యని విశాలున కాశీర్వాదమొసంగి తత్పితరులు స్వర్గమున కరిగిరి. విశాలరాజు తదాశీర్వాద ప్రభావమున చిరకాలము రాజ్యమొనర్చి సమస్తభోగ భాగ్యముల ననుభవించి, అంతమందు వైకుంఠమున కరిగెను.

ఇవ్విధంబుననే, గయాశ్రాద్ధమువలన ప్రేతరాజు ప్రేతములతో స్వర్గమునుఁజెందెను. ఒకానొక ప్రేతము, తనముక్తికొఱకు, నొక వణిజుని జేరి నీవు నాగృహమునకరిగి, యందుఁగల ధనములో పదునాఱు భాగములలో నైదుభాగములు స్వీకరించి, మిగిలిన పదునొకండు భాగములను, నాకీ ప్రేతత్వము వీడి ముక్తిలభించునటుల గయాక్షేత్రమునఁ బిండదానమొసంగి తత్క్షేత్రమందు నాపేరున వెచ్చింపవలయునని యేకాంతమునఁ జెప్పెను. తద్విధమున వణిజుఁడు గయాక్షేత్రమున ప్రేతరాజునకును, తన పితరులకును పిండదానమొనర్చెను. వారలు ప్రేత

యోనులనుండి వెలువడి స్వర్గతిని బొందిరి. వణిజుఁడు తనగృహంబున కరుగుదెంచెను.

బ్రహ్మ విష్ణు మహేశ్వర నివాసభూమియగు గయాక్షేత్రమందు మహానదీతీరమందలి గాయత్రీ తీర్థమందు గాయత్రీసమ్ముఖమున నుపవసించి స్నానమొనర్చి ప్రాతఃకాల సంధ్యనారాధించి పిండాత్మక శ్రాద్ధమొనర్చిన మనుజుఁడు తనకులము నుద్ధరించినవాఁడగును. సావిత్రీ తీర్థమందు సావిత్రీ సమ్ముఖమున స్నానమొనర్చి మాధ్యాహ్నిక సంధ్య నుపాసించిన నూరు కులములు తరించి ముక్తినొందుదురు. అందు పితృముక్తికొఱకు పిండదానమొనర్పవలయును. సరస్వతీ తీర్థమందు విధి పూర్వకముగా స్నానమొనర్చి సాయం సంధ్య నారాధించిన, పితరులు విష్ణులోకమున కరుగుదురు. ఈవిధంబున మూఁడుతీర్థములయందు విధి పూర్వకముగా త్రికాలసంధ్యల నారాధించిన, బహు జన్మముల సంధ్యాలోపమువలన లభించిన పాపము నశించును. విశాల, లేలిహానతీర్థ, భరతాశ్రమ, పాదచిహ్నిత, ముండపృష్ఠపర్వత, గదాధర సమీపమందున్న ఆకాశగంగ, గిరికర్ణ ముఖాది తీర్థములయందు స్నానమొనర్చి విధ్యుక్తముగా సపిండశ్రాద్ధములు సలిపిన మనుజులు శతకులములతో బ్రహ్మలోకమున కరుగుదురు. దేవనది వైతరణియందు స్నానమొనర్చిన, పితరులు స్వర్గమున కరుగుదురు. గోదావరి నదీ స్నానమువలన నిరువదియొక్క కులములు తరించును. నారదా! వైతరణీ స్నానమువలన నిరువదియొక్క కులములు తరించును. ఇది సత్యము. ముమ్మాటికిని సత్యము. యమద్వారమునందున్న ఘోరవైతరణీ నద్యుత్తరణార్థము కృష్ణవర్ణగోవును దానము సేయవలయును. త్రైలోక్య విఖ్యాతమగు వైతరణీనద్యుత్తరణార్థము, పిత

రుల మోక్షార్థము, శక్త్యశక్తుల నాలోచింపక నవశ్యముగా గోదానము నేయవలయును. వైతరణీ తీర్థమందు మూఁడురాత్రు లుపవసింపవలయును. ఈ తీర్థమందు దానము సలుపని యెడ దరిద్రులయ్యెదరు. ఘృతకుల్య, మధుకుల్య, దేవిక, మహానదులు శిలపై మధుశ్రవతీర్థమందు సంగమమగుచుండెను. ఈ స్థలమందు స్నానమొనర్చిన మనుజులు దశసహస్రాశ్వమేధయాగములొనర్చిన ఫలమును బొందుదురు. ఈస్థలమందు సపిండశ్రాద్ధమొనర్చిన, నూఱుకులములతో తరించి విష్ణులోకమున కరుగుదురు. దశాశ్వమేధ, హంసామరకంటక, కోటి తీర్థములయందును, రుక్మిణీ కుండమందును స్నానమొనర్చిన, సపిండశ్రాద్ధమొనర్చిన, పితరులు స్వర్గమున కరుగుదురు. వైతరణీ, ఘృతకుల్య, మధుకుల్య, కోటి తీర్థములయందు స్నానమొనర్చి కోటీశ్వరుని దర్శనము సేయువారలు, కోటిజన్మములవఱకు బ్రాహ్మణులై, ధనాఢ్యులై, వేదవేదాంగ పారగులై, మార్కండేయునిఁ బోలి చిరజీవులై యొప్పుదురు. కోటీశ్వరునకు నతులొనర్చిన వారు వారిపితరుల తరింపఁజేయుదురు.

పూర్వమున సువర్ణ పారిజాతవనమున రహస్యముగా పార్వతీసహితుఁడై శంకరుఁడు దశసహస్రవర్షములు వాస మొనర్చెను. తద్వనమునకు ఫలపుష్పసంగ్రహామునకు తత్సమయమునఁ జనుదెంచిన మరీచిమహర్షిని శంకరుఁడు చూచి, క్రుద్ధుఁడై, నీవు ఇందు చనుదెంచి మాసౌఖ్యమునకు విఘాత మొనర్చితివి గావున దుఃఖభాజనుఁడ వగుమని శాపమొసంగెను. ఆ శాపమునకు ఖేదచిత్తుఁడై మరీచి బహువిధంబుల పార్వతీవల్లభుని ప్రార్థించి స్తుతియింప, ప్రసన్నుఁడై, మునివరా! నీవలయు దాని కోరుము. ఒసంగెదను. అని పలికెను. మహేశ్వరుని వాక్య

ములై కలరి, మహాదేవా! నీ యీశాపమునుండి నాకు ముక్తి నొసంగుము. అని మరీచి వేఁడుకొనెను. నీవు గయాక్షేత్రమున కరిగినయెడ, శాపవిముక్తుఁడ వగుదు వని మరీచిమహర్షికి ఈశ్వరుఁడు వరమొసంగెను. మరీచి గయాక్షేత్రమున కరిగి శిలపై గూర్చుండి మున్నెన్నఁడు, ఎవ్వరును సలిపి యుండని దారుణ తపము సలిపెను. ప్రథమమున మహేశ్వరుని శాపము వలన మరీచి కృష్ణవర్ణతనుధారి యయ్యెను. అయ్యది చూచి తిరుగ ఘోరతపము సలుప శ్వేతవర్ణతనుధారి యయ్యెను. శిలయు పాండువర్ణము వహించెను. మరీచి యొనర్చిన తపంబునకు విష్ణుభగవానుఁడు ప్రసన్నుఁడై, పుత్రా! నీ వలయువరమును యాచింపుము. అని పలుక, మరీచి, దేవదేవా! నీవు నాయందు ప్రసన్నుఁడవైతివి. ఇంతకంటె నాకేమి కావలయును మును నాకు నీశ్వరుఁడొసంగిన శాపమునకు ముక్తినొసంగుము. ఈ శిల పవిత్రమై పితరులకు మోక్షమొసంగునదిగా నొనర్పుము. అని యాచింప, "తథాస్తు" అని పలికి, నారాయణుఁడు వైకుంఠమునకరిగెను. దేవపుష్కరిణియందు స్నానమొనర్చిన మనుజులు పాపరహితులై పవిత్రులయ్యెదరు. అందుఁ బిశ్వనిమిత్త మొనర్చిన దాన మక్షయమగును. దేవపుష్కరిణియందు స్నానమొనర్చిన మనుజులు స్వశరీరములతో స్వర్గమున కరుగుదురు. జీర్ణకుబుసమునుండి సర్పమెవ్విధంబునవిడివడునో, అవ్విధంబున పురుషులిందుస్నానమొనర్చిన, పాపసంచయములనుండి వెలువడుదురు. అందు పాండుశిలయనునామమున విఖ్యాతమగుశిలయందుశ్రాద్ధమొనర్చిన అక్షయ్యమగును. నారదా! యుధిష్ఠిర మహారాజీశిలయందు శ్రాద్ధమొనరింప నరిగెను. శ్రాద్ధసమయమందు పాండురాజు చనుదెంచి, పిండమును నాహస్తమందిడుము అని

యుధిష్ఠిరునిఁ గోరెను. యుధిష్ఠిరుఁడు, పాండురాజుమాటలఁ బాటింపక, శిలయందు పిండము నిచ్చెను. శిలయందు పిండముం చగనే పాండురాజు ప్రసన్నుఁడై, తనయుధిష్ఠిరకుమారునితో, నీవు నన్నుఁదరింపఁజేసితివి. నీవు చక్రవర్తివై భూమిని పాలించి సమస్తభోగముల ననుభవించి, నిన్ననుసరించిన వారలతో సశరీర స్వర్గమునుఁ బొందుము. నీ దర్శనమాత్రమున నరకవాసులు పవిత్రులై స్వర్గమున కరుగుదురు. అని పలికి శాశ్వతబ్రహ్మపదమునుఁ బడసెను. మతంగపదమందు శ్రాద్ధమొనర్చిన, పితరులు బ్రహ్మలోకమునుఁ బొందుదురు.

బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలు శమీగర్భమును మథించి, అగ్నినిపడసి, యజ్ఞమొనర్చినకారణమున తత్స్థలము మఖతీర్థమనునామమున త్రిలోకవిఖ్యాతమై, పితరులకు మోక్ష మొసంగుచుండెను అంగారకేశ్వరునకు నమస్కారమొనర్చి గయాకూపమందు పిండదానమొసంగిన,నశ్వమేధయాగము లొనర్చిన ఫలము చేకూరును. భస్మకూట పర్వతమునందు స్నానముసేసిన, భస్మనాథ మహాదేవుఁడు పితరులను తరింపఁజేయును. సంగమస్థానమందు స్నానమొనర్చిన, సమస్తపాపముల ను నాశనమొనర్చి మోక్ష మొసంగును. ధౌతపాదుఁడై, నిక్షీర సంగమస్నానము, గామకుండశ్రాద్ధము సలిపినమనుజుఁడు పితరులతో బ్రహ్మలోకమునుఁ బొందును. సుషుమ్నలేక మహాకుల్య యందు స్నానమొనర్చిన నిరువదియొక్క కులములు తరించును. వశిష్ఠతీర్థమందు స్నానమొనర్చి వశిష్ఠునకు నమస్కారముసేసిన నశ్వమేధయాగఫలము లభించును. అందు వశిష్ఠమహర్షి యొనర్చిన యశ్వమేధయాగమునకు నీశ్వరుఁడుప్రసన్నుఁడై, వశిష్ఠా! నీవొనర్చినయాగమునకు నేను సంతుష్టుఁడనైతిని. వర మొసఁగ

గాడనడుగుమని పలికెను. దేవదేవా! నాయందుప్రసన్నులరైన ట్లైన, నీస్థలమందు నివసింపుఁడని వశిష్ఠుఁడు మహేశ్వరునిఁ బ్రార్థించెను. వశిష్ఠప్రార్థనానుసారముగా మహేశ్వరుఁ డందు నివసించెను. ధేనుకారణ్యమున, కామధేనుపాదమున స్నాన మొనర్చి పిండదానమొసంగిన, పితరులు బ్రహ్మలోకమున కరు గుదురు. గయానాభి ముండపృష్ఠసమీపమందలి కర్దమాలయ మున స్నానము సేసి. శ్రాద్ధాదులొనర్చిన పితౄణముక్తులగుదు రు. ఫల్గుచండి, శ్మశానాక్షీ, మంగళగౌరులఁబూజించి, గయాక్షే త్రమందు, వృషోత్సర్గమొనర్చిన, త్రిసప్తకులంబులు తరిం చును. గయాక్షేత్రమందు, దేవతలు, జితేంద్రియులు, ఋషి వర్యులు, ఎచ్చెచ్చట నివసించియుండిరో, అచ్చటచ్చట వారి వారికి పూజసలుపవలయును. గయా, గజ, గయాదిత్య, గాయ త్రి, గదాధర, గదా, గయాశిరము, అనునీగకారసప్తకము పిత రులకో మోక్షమొసంగునది. ప్రథమమున గదాధరుని ధ్యా నమొనర్చినశ్రాద్ధాదికములు సలుపవలయును. అట్లుసలిపినవా రలు నూఱుకులములతో తరించి బ్రహ్మలోకమున కరుగుదు రు. ఎవరు ఈగయామాహాత్మ్యమును సభక్తికముగా నిరంత రమును, వినినను, పఠించినను, వ్రాసినను, వారలు ముక్తినొం దుదురు ఎవరుయథాశక్తి, విధిపూర్వకముగా వ్యాసమహర్షిని పూజించి, గోభూ, హిరణ్య, వస్త్ర, భూషణాద్యలంకారముల ను సమర్పించెదరో, వారుసమస్తభోగభాగ్యములననుభవించి, అంతమందు మోక్షమునుఁ బడయుదురు. పవిత్రులగు బ్రాహ్మ ణులచే గయాఖ్యానపారాయణమును సేయింపవలయును. నార దా! గయాక్షేత్రగయాశ్రాద్ధముల మాహాత్మ్యమును వినుము. గయా శ్రాద్ధము సలిపినమనుజులు, జ్యోతిష్టోమ, రాజసూయా

శ్వమేధయాగము లొనర్చినఫలమునుఁ బొందుదురు. గయా క్షేత్ర మాహాత్మ్యపుస్తకమునుఁ బూజించువారి గృహమందు లక్ష్మీ ప్రసన్నహృదయురాలై వాసముసేయుచుండును గయామాహాత్మ్య పుస్తకమున్న గృహమునందు, సర్ప, చో, రాగ్నిభయములు లేక సుఖంబుననుందురు. శ్రాద్ధకాలమందు గయామాహాత్మ్యమును పఠించినయెడల నా శ్రాద్ధమందు విధిలోపము తటస్థించినను, న్యూనరహితమై, గయాశ్రాద్ధసమానమై ఫలయుక్తమగును. త్రిలోకములయందుఁ గల సమస్తతీర్థములు గయాక్షేత్రమందుఁ గలవు. గయామాహాత్మ్యమును పఠించువారలు, వినువారలు, వ్రాయువారలు, వివరముగా తెలిసికొనువారలు, నారదా! గయాశ్రాద్ధ మొనర్చిన ఫలమునుఁ బడయుదురు. సనత్కుమారుఁడు నారదమహర్షికి చెప్పిన గయామాహాత్మ్య విధంబును, శౌనకాదిమహర్షులు సూతునివలన విని సంతుష్టహృదయులై నిజనివాసంబుల కరిగిరి.

ఇది అష్టమాధ్యాయము.

గయామాహాత్మ్యము సంపూర్ణము.

---



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. [illegible]

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| దశకుమారచరిత్రము, ఎనమచింతల సంజీవరాయశాస్త్రికి ... | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు ... | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, ... | 0 | 12 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము ... | 1 | 8 |
| భోజునికథలు ... | 0 | 8 |
| విక్రమార్కునికథలు ... | 0 | 8 |
| వేతాళునికథలు ... | 0 | 8 |
| పరమానంద శిష్యులకథలు ... | 0 | 8 |
| వైద్యులకథలు ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు ... | 0 | 4 |
| అయిదుగురువొంగలకథలు ... | 0 | 6 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసము ... | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసము ... | 0 | 2 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర ... | 0 | 3 |
| శ్రీలాలాలాజ్ పతిరాయిజీవితము ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము, ప్రతిమతో ... | 0 | 3 |
| బాలగంగాధరతిలకుమహారాజుగారి చరిత్రము, ప్రతిమతో ... | 0 | 4 |
| శ్రీగోపాలకృష్ణగోఖ్లేజీవితము, ప్రతిమతో ... | 0 | 2 |
| శ్రీమహాదేవగోవిందరానడేజీవితము ,, ... | 0 | 2 |
| శివాజీచరిత్ర ,, ... | 0 | 8 |
| శ్రీశంకరాచార్యచరిత్ర ,, ... | 0 | 3 |
| శ్రీవేమనయోగిజీవితము ,, ... | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, ... | 0 | 2 |